చందా వివరములు
బుధవారపు సచిత్ర వారపత్రిక

| | రూ. | [నయాపైసలు] |
|---|---|---|
| సంవత్సర చందా ... | 18 | 00 |
| అర్ధ సంవత్సర చందా ... | 6 | 50 |
| విడి ప్రతి ... | ,, | 25 |
| భారతి (సచిత్ర మాసపత్రిక) | | |
| సంవత్సర చందా ... | 12 | 00 |
| అర్ధ సంవత్సర చందా ... | 6 | 00 |
| విడి ప్రతి ... | 1 | 00 |

ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.


# ఆంధ్రపత్రిక

31520





The Andhra Patrika - Madras సంపుటం 44. సంచిక 94 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO శుక్రవారం 5-7-1957 Reg. No. M. 1118 6 పేజీలు 7 నయాపైసలు


# రష్యా కమ్యూనిస్టు పార్టీ అధికార వర్గంలో ముసలం

## మాలటోవ్, మాలెంకోవ్, కగనోవిచ్, షెపిలోవ్‌ల హఠాత్ బర్తరఫ్

### కృశ్చేవ్ తీర్మానానికి విరుద్ధంగా చేశారని ఆరోపణ

లండన్, జులై 4: రష్యా కమ్యూనిస్టుపార్టీ అధ్యక్ష మండలినుంచి అగ్రనాయకులు శ్రీ మాలటోవ్, శ్రీ మాలెంకోవ్, శ్రీ కగనోవిచ్, శ్రీ షెపిలోవ్‌లను బర్తరఫ్ చేసినట్లు, నిన్నరాత్రి పార్టీ కార్యాలయం ప్రకటించింది.

ఈ నాయకవర్గం, 20 వ కమ్యూనిస్టు కాంగ్రెస్ తీర్మానానికి ప్రతికూలంగా కృషిచేస్తున్నారని పార్టీ ఆరోపించింది.

అయితే వీరిని మంత్రిత్వ పదవుల నుంచి తొలగించారో లేదో తెలియదు.

అధ్యక్ష మండలి సభ్యత్వ సంఖ్యను 11 నుంచి 15కు పెంచి, పార్టీ కొత్త మండలి సభ్యులను ఎన్నుకుంది.

స్టాలిన్‌మృతి అనంతరం రష్యాలో, బెరియా పదవీచ్యుతుడై ఉరికి బలైనాడు, అనేకమైనమార్పులు జరిగాయి, కాని ఇంత పెద్ద మార్పు, సంచలనం ఎన్నడూ కలగలేదు.

అధ్యక్ష మండలిలో శ్రీ మాలటోవ్, శ్రీ కగనోవిచ్, శ్రీ మాలెంకోవ్ లకు పూర్తిసభ్యత్వం ఉండేది. షెపిలోవ్‌కు పర్యాయ సభ్యత్వం ఉండేది, అంటే మండలి సమావేశాల్లో పాల్గొనే హక్కు వీరికి ఉంటుంది, కాని వోటు చేసే హక్కుండదు.

రష్యాలో నిజంగా అధికారం కలిగినది ఈ అధ్యక్ష మండలే. పరిపాలనా వ్యవహారాలన్నీ ఈ మండలి నిర్ణయించిన మీదటనే అసలు పార్లమెంటు అధ్యక్ష మండలికీ, పార్లమెంటుకూ ఆమోదానికి వస్తాయి.

బర్తరఫ్ అయిన నలుగురిలో శ్రీ మాలటోవ్, శ్రీ మాలెంకోవ్, శ్రీ కగనోవిచ్‌లు స్టాలిన్ మిత్రులు. శ్రీ షెపిలోవ్ ఒక్కరే స్టాలిన్‌కు సన్నిహితులు కానివారు.

#### కొత్త మండలిలో ఝుకోవ్‌కు స్థానం

పార్టీ ఎన్నుకున్న కొత్త అధ్యక్ష మండలిలో ఈమారు ప్రసిద్ధ సైనికాధిపతి, రష్యాలో అపార ప్రజాదరం పొందిన నాయకుడు అయిన మార్షల్ ఝుకోవ్‌కు పూర్తి సభ్యత్వం లభించింది. ప్రజలలో వీరిపట్ల వ్యాపించిన ప్రతిష్ఠకు భీతిచెంది ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో వీరిని స్టాలిన్ దూర ప్రాంతాలకు పంపివేశారు.

శ్రీ మాలటోవ్, శ్రీ కగనోవిచ్‌లు ఇద్దరికీ మంత్రి మండలిలో ఉపప్రధాని హోదా ఉంది. శ్రీ లాజార్ కగనోవిచ్ గృహనిర్మాణ సామగ్రిశాఖ నిర్వహిస్తున్నారు.

స్టాలిన్ మృతి అనంతరం కొన్నాళ్లు ప్రధాన మంత్రిగా పనిచేసిన శ్రీ జార్జి మాలెంకోవ్ ప్రస్తుత మంత్రిమండలిలో విద్యుదుత్పత్తి కేంద్రాల మంత్రిగా పని చేస్తున్నారు.

శ్రీ ఆంద్రీ గ్రొమికో విదేశాంగ మంత్రిత్వ పదవి స్వీకరించేముందు, ఆ పదవిలో ఉండిన శ్రీ షెపిలోవ్ ఇటీవల కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సంఘ కార్యదర్శిగా ఉంటూ వచ్చారు.

నిన్న రాత్రి వీరిని ఈ కార్యదర్శి పదవినుంచికూడా పార్టీ బర్తరఫ్ చేసింది.

#### పార్టీ ఆరోపణ

ఈ నాయకవర్గం పార్టీకి విరుద్ధంగా వ్యవహరించిన కథనంతనీ పార్టీ ప్రకటనలో వివరించింది.

భిన్న దేశాల ప్రజల మధ్య శాంతియుత వ్యవహారవిధానాన్ని సోవియట్ ప్రభుత్వం అనుసరించకుండా నిరోధించారని పార్టీ శ్రీ మాలటోవ్ పై ఆరోపణ చేసింది.

20 వ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెస్ నిర్ణయాలకు విరుద్ధంగా (బర్తరఫ్ అయిన)ఈ నాయకవర్గం కృషి చేసింది. 20వ కాంగ్రెస్ నిర్ణయాలు తమ అభిప్రాయాలకు భిన్నంగా ఉన్నందువల్ల, వారు తప్పు అభిప్రాయాలను వ్యాపింప చేసి, ఒప్పింప చెయ్యడానికి ప్రయత్నించారు.

#### అన్యరాజ్యాలతో వైషమ్యాలకు మాలటోవ్ బాధ్యత

పార్టీ ప్రకటనలో ముఖ్యంగా శ్రీ మాలటోవ్ పైనే అధికంగా నేరారోపణ కనపడింది.

అంతర్జాతీయ వైషమ్యాలను ఉపశమింపచేసి, అంతర్జాతీయ శాంతిని పెంపొందించే కృషిని శ్రీ మాలటోవ్ నిరోధించారట.

యుగోస్లావియాపట్ల అనుసరించిన విధానానికి, ఆస్ట్రియాతో శాంతి సంధి కుదరకపోడానికి, జపాన్‌తో సహజ సంబంధాలు తిరిగి నెలకొల్పకపోవడానికి శ్రీ మాలటోవ్ కారకులని ఆరోపించింది. సహజీవన సిద్ధాంతాన్ని శ్రీ మాలటోవ్ ప్రతిఘటించారట.

రష్యాలో సమష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులపై భారాలు ఎక్కువ మోపినందుకు బాధ్యత వారిదేట.

(6 వ పుట చూడుడు)

## అణ్వస్త్ర పరీక్షల నిలుపుదల

### నెహ్రూ ప్రభావం

లండన్, జులై 4: అణ్వస్త్ర పరీక్షలను నిలుపుదల చెయ్యాలంటూ, కామన్ వెల్తు ప్రధానుల సభలో గట్టిగా మాటలాడిన అనంతరం, పశ్చిమ రాజ్యాల వారిలోకూడా ఈ విషయమై పట్టుదల సడలడం మొదలైనట్లు, పైగా ఇంకా శ్రీ నెహ్రూ ప్రభావంకన్పడకపోతున్నా, ప్రపంచ రాజకీయవర్గాలలో, ఆయన మాటలు బాగా చెల్లుబడి అవుతున్నట్లు తెలియవస్తోంది.

పశ్చిమ రాజ్యాలు ఈ పరీక్షలను మానుకోరాదన్న పట్టుదలను కొంచెం సడలించుకోడానికి, శ్రీ నెహ్రూ ప్రభావమే కారణం అంటున్నారు. ఈ ప్రభావం, ముందు ముందు ఇంకా బాగా కనపడగలదనికూడా ఇక్కడి అభిజ్ఞులు భావిస్తున్నారు.

మంగళవారంనాడు శ్రీమతి విజయలక్ష్మి విందుచేసిన సందర్భంలో, శ్రీ నెహ్రూ, రష్యా రాయబారి శ్రీమలిక్ ఏమో మాటలాడారు. అణ్వస్త్ర పరీక్షల విషయంలో రష్యా వైఖరి, భారతదేశం వైఖరి సన్నిహితమై వున్న సంగతి అందరికీ తెలిసిన విషయమే.

ఇప్పుడు పాశ్చాత్య రాజ్యాలవారు షరతులతో అయినా, అణ్వస్త్ర పరీక్షలను ఆపడానికిసిద్ధంగా వున్నామనిముందుకు వస్తున్నారు. శ్రీలాయిడ్, పశ్చిమ రాజ్యాల తరఫున, ఇటువంటి సూచన లనే, సమితి నిరాయుధీకరణ ఉపసంఘంలో ప్రతిపాదించారు. పూర్వం, ఈ పరీక్షలను ఆపడం అనే మాటలు విన్పించే సరికే, వీరు చెవులు మూసుకుంటూ వుండేవాళ్లు. అందువల్ల, రాజకీయజ్ఞులు ఈ ప్రతిపాదనలు, కొంతవరకు లోపభూయిష్టంగా వున్నా, బయటికి అంటూ వచ్చినందుకు సంతోషిస్తున్నారు.

## చైనాలో కమ్యూనిస్టు పార్టీమీద కుట్ర

హాంకాంగ్, జులై 4: చైనా ప్రభుత్వంలోని రవాణామంత్రిగా వున్న శ్రీ ఛాంగ్ పోచున్, అడవులమంత్రి శ్రీ లోల్యంగ్ ఛిలు, కమ్యూనిస్టుపార్టీని కూలద్రోయ్యడానికి కుట్రపన్నినట్లు, పార్లమెంటు సభ్యుడు శ్రీ టెంగ్ షుమింగ్ నేడు ఒక ఆరోపణ చేశారు.

ఈ ఇద్దరిలోను శ్రీ ఛాంగ్ తాను పార్టీపద్ధతులకు వ్యతిరేకంగా పనిచేసినట్లు నిన్న ఒప్పుకున్నారు. శ్రీ లో మాత్రం ఇంతవరకు పార్టీ ముందుకు రాలేదు. తప్పొప్పుకోలేదు. అందువల్ల ఈయన్ను ఇవ్వాళ్ళ తీవ్రంగా విమర్శించారు.

శ్రీ ఛాంగ్, శ్రీ లో లు ఇద్దరు, "ప్రజాస్వామిక బృందం" అనే ఒక వర్గానికి నాయకులు. వీరిద్దరు, ఆ బృందాన్ని తమ అదుపులోకి తెచ్చుకొని కమ్యూనిస్టుపార్టీ పతనానికి ప్రోద్బలం చెద్దామని కుట్రపన్నారు.

# ఆహారమండలం ఏర్పాటుకు 4 దక్షిణ రాష్ట్రాల సమ్మతి

## ఆంధ్రకు ఉత్తరాది వ్యాపారం పోదని జైన్ హామీ

['ఆంధ్ర పత్రిక' ప్రతినిధి]

హైదరాబాదు, జులై 3: తమ నాలుగు రాష్ట్రాలను చేర్చి దక్షిణాన ఆహారమండలాన్ని యేర్పాటుచేయడానికి, ఆంధ్రప్రదేశ్, మద్రాసు, మైసూరు కేరళ, ఆహార, వ్యవసాయ శాఖల మంత్రులు ఇవాళటి సమావేశంలో అంగీకరించారు. ఇక త్వరలోనే కేంద్రప్రభుత్వం తుది నిర్ణయం చేస్తుంది.

దక్షిణ ఆహారమండలం యేర్పాటువల్ల ఆంధ్రప్రదేశ్‌కు ఉత్తరాదితో ఉన్న సన్నబియ్యం ఎగుమతి వ్యాపారానికి ఏమీ దెబ్బ తగలదని కేంద్ర ప్రభుత్వ ఆహార వ్యవసాయ శాఖల మంత్రి శ్రీ అజిత్‌ప్రసాద్ జైన్ హామీ ఇచ్చారు.

ఈ నాలుగు రాష్ట్రాల ఆహార వ్యవసాయశాఖల మంత్రుల సమావేశం శ్రీ ఎ. పి. జైన్ అధ్యక్షతన జరిగింది కేంద్ర ఆహారశాఖ ఉపమంత్రి శ్రీ కృష్ణప్పకూడా హాజరైనారు.

సమావేశంలో చర్చించిన విషయాలను గురించి, శ్రీ ఎ. పి. జైన్ పత్రికా విలేఖరులకు ఇలా చెప్పారు.

"ఈ సమావేశంలో మూడు ప్రతిపాదనలు చర్చకువచ్చాయి. (1) నాలుగు రాష్ట్రాలను చేర్చి మండలం యేర్పాటు చేయాలని (2) కేరళను మినహాయించాలని (3) మద్రాసు లేకుండా మిగతా మూడురాష్ట్రాలతో మండలం పెట్టాలని. మంత్రులందరూ నాలుగు రాష్ట్రాలను మండలంలో చేర్చితేనే బాగుంటుందని అభిప్రాయపడ్డారు.

### ఆంధ్ర ఎగుమతి వర్తకం దెబ్బతినదు

ఇలా ఆహారమండలాన్ని ఏర్పాటు చేయడంవల్లకాను,సన్నరకాల బియ్యం ఎగుమతికిఉత్తరాదినబొంబాయి,కలకత్తా రాష్ట్రములలో కొత్తగా సంపాదించుకొన్న మార్కెట్లు పోతాయేమోనని ఆంధ్రప్రదేశ్ ఒక భయాన్ని వెల్లడించింది. అటువంటిదేమీ లేకుండా అనుమతుల (పర్మిట్లు) పద్ధతిపై, సన్నబియ్యాన్ని మండలం వెలుపలి ప్రాంతాలకు ఎగుమతి చేసుకోవచ్చని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి నేను హామీ

(6 వ పుట చూడుడు)

## ఆంధ్రప్రదేశ్ ఎగువ శాసనసభ

### డిసెంబరుదాకా ఏర్పడదు

హైదరాబాదు, జులై 4: ఆంధ్రప్రదేశ్ ఎగువశాసనసభ (లెజిస్లేటివ్ కౌన్సిలు) లో 90 మంది సభ్యులు ఉంటారని, పార్లమెంటులో శాసనం కాగానే, యీ సభను ఏర్పాటుచేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అవసరమైన చర్యలు తీసుకొంటుందని ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఇవాళ పత్రికా విలేఖరులతో చెప్పారు.

ఇప్పటి కార్యక్రమం ప్రకారం నవంబరు, డిసెంబరు నెలలలోగా ఈసభ ఏర్పాటుకాదని, యీలోపుగా నియోజకవర్గాల విభజన పని ప్రభుత్వం ప్రారంభించినదని ముఖ్యమంత్రి తెలియజేశారు.

పోర్ట్ మోరెస్బీ, జులై 3: భారత ప్రధాని శ్రీ నెహ్రూ వచ్చే సంవత్సరం ఆరంభంలో ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ పర్యటించగలరని, భారత హై కమీషనరు శ్రీ అచ్యుత మీనన్ ఇక్కడ చెప్పారు.

# భద్రాద్రి పడవ ప్రమాదంలో నష్టపడినవారికి పరిహారం

## విచారణ సంఘం సిఫార్సు: వివరాలకు ఉత్తర్వు

హైదరాబాదు, జులై 4: భద్రాచలంవద్ద గోదావరిలో పడవల ప్రమాదంవల్ల నష్టపడిన కుటుంబాలకు పరిహారం చెల్లించాలని, విచారణ సంఘం సిఫార్సు చేసినట్లు, ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఇవాళ పత్రికా విలేఖరులతో చెప్పారు.

చనిపోయిన వారిపేర్లను, వారిబంధువులపేర్లను పంపలసిందిగా జిల్లా కలెక్టర్లను ప్రభుత్వం కోరిందని యింతమటుకు ఏవో కొద్దిపేర్లు మాత్రమే ప్రభుత్వానికి అందాయని, శ్రీ సంజీవరెడ్డి తెలియజేశారు.

ఏప్రిల్ 10 వ తేదీన భద్రాచలంవద్ద గోదావరిలో రెండు పడవలు మునిగిపోయి 201 మంది యాత్రికులు చనిపోయిన విషయం పాఠకులకు తెలిసినదే.

ఆరోజున బందోబస్తులో ఉన్న పోలీసులు తమ విధ్యుక్తాన్ని బాగానే నిర్వహించినట్లు విచారణసంఘం అభిప్రాయపడిందని ముఖ్య మంత్రి అన్నారు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణంరాజు అధ్యక్షులుగా అధికార, అనధికార సభ్యులతో ప్రభుత్వం నియమించిన సంఘం, ప్రమాదస్థలంవద్ద హైదరాబాదులోను 75 మంది సాక్షులను విచారించి, యీ మధ్యనే ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది. ఆ నివేదికలో, ప్రమాదానికి ఫలానా ఉద్యోగిబాధ్యుడని నేరం మోపడానికి వీలుకాదని, పడవలను, ప్రయాణీకులనుండి రుసుం వసూలుచేయడానికి నది మధ్యలో నిలపకపోయినట్లయితే ప్రమాదం సంభవించి ఉండకపోవచ్చని అభిప్రాయం వెల్లడించింది.

విచారణ సంఘ నివేదికను, దానిపై ప్రభుత్వ అభిప్రాయాలను, త్వరలోనే ప్రచురించడమౌతుందని శ్రీ సంజీవరెడ్డి వెల్లడించారు.

"పడవ ప్రమాదానికి కారణం అవి ఓటి పడవలవడం; ఆ పడవలను, ప్రయాణీకులనుండి రుసుం వసూలుకోసం, నది మధ్యలో నిలపడం—కేవలం ఇవే కారణమని విచారణ సంఘం తన నివేదికలో పేర్కొన్నది. ఈ ప్రమాదానికి బాధ్యులైన వారిపై చర్యతీసుకోవడం జరుగుతోందని అనుకుంటా", అన్నారు ముఖ్య మంత్రి.

### త్వరలోనే నిబంధనలు

"గోదావరిపై పడవలు నడపడానికి సంబంధించి, ఖచ్చితమైన నిబంధనవీ లేదు. అందువల్ల, అటు ఆంధ్ర వైపుగాని, ఇటు తెలంగాణ వైపుగాని, అధికారులు, పడవల నిర్వహణను అదుపుచేయ లేకున్నారు. అందుకు తగ్గ అధికారాలు వారికి లేవు. ప్రయాణీకుల క్షేమం ముఖ్యం గాబట్టి, ప్రభుత్వం త్వరలోనే ఖచ్చితమైన నిబంధనలను రూపొందిస్తుంది"

### బాధితులకు పరిహారం

"మొన్నటి ప్రమాదంలో చనిపోయినవారి కుటుంబాలకు తగిన పరిహారం ఇచ్చే ఉద్దేశ్యంతో, చనిపోయినవారి పేర్లను, వారి కుటుంబాల పేర్లను పంపవలసిందిగా ఇదివరకే కలెక్టర్లకు ఉత్తర్వు చేశాము. కొద్ది పేర్లు వచ్చాయి. ఈ పరిహారం చెల్లింపు పని యావత్తూ సాధ్యమైనంత త్వరలో పూర్తి అవుతుందని ఆశిస్తున్నాను." అని శ్రీ సంజీవరెడ్డి తెలియజేశారు.

ప్రయాణీకులను భద్రంగా చేరవేయడానికి బందోబస్తు ఏర్పాట్లగురించి, విచారణ సంఘం చేసిన సిఫార్సులు ప్రభుత్వం పరిశీలిస్తోందని చెప్పారు.

# ఎరువుల కిచ్చిన అప్పులు ధాన్యంరూపేణా వసూలు

## దక్షిణరాష్ట్రాల ఆహార మంత్రుల అంగీకారం

హైదరాబాదు, జులై 3: ఎరువులు కొనుక్కోడానికి రైతులకు ఇచ్చిన అప్పులను, వడ్లరూపంలో వసూలు చేయాలనే సూచనకు ఆంధ్ర, మద్రాసు, మైసూరు, కేరళ రాష్ట్రాల ఆహార వ్యవసాయ మంత్రులు స్థూలంగా అంగీకరించారని, కేంద్ర ఆహారశాఖమంత్రి శ్రీ అజిత్ ప్రసాద్ జైన్ చెప్పారు.

ఇవాళ వీరి సమావేశానంతరం శ్రీ జైన్ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ, అప్పుల పరిష్కారం క్రింద రైతులనుండి కొనే ధాన్యంలో సగం, ఆహార కొరత ఏర్పడ్డప్పుడు విడుదల చేయడానికి వీలుగా, రాష్ట్ర ప్రభుత్వాల వద్ద నిల్వ ఉంచవచ్చునని, ధరల నిలకడకు అవసరమైతే, కొంత తక్కువ ధరలకు రాష్ట్ర ప్రభుత్వాలు ఇవ్వవచ్చునని అన్నారు. మిగతా సగం ధాన్యం తరుగు రాష్ట్రాలకు ఇచ్చేందుకు కేంద్రం వద్ద నిల్వ ఉంచవచ్చునని శ్రీ జైన్ అన్నారు.

ఎరువుల అప్పుల క్రింద రైతులనుండి వసూలుచేసే ధాన్యానికి న్యాయమైన ధరకట్టే ఇస్తారని జైన్ హామీ ఇచ్చారు.

## ఇరాన్‌లో భూకంపం

టెహరాన్, జులై 4: సోమవారం రాత్రి ఈ పట్టణానికి 50 మైళ్ళలో వచ్చిన భూకంపంవల్ల ఆస్తి, జననష్టం అపారంగా ఉందని ఇప్పటికి 1000 శవాలు కన్పించాయినీ, మృతుల సంఖ్య గంటగంటకూ పెరుగుతోందని, పత్రికా వార్తలవల్ల తెలిసింది.

అండలు విరిగిపడి అనేక గ్రామాలు ధ్వంసమైనాయి. నిన్న రాత్రి కూడా కాస్పియన్ ప్రాంతపు పట్టణాలలో భూకంపం వచ్చింది.



### కావలెను

ఆయుర్వేద ఔషధములలో మంచి అనుభవము గలవారు ఆంధ్రరాష్ట్రంలో మెడికల్ సేల్సు రిప్రజెంటేటివుగా పని చేయుటకు కావలెను. కావలసిన కనిస జీతముతోగూడ వివరములతో వ్రాయ్సు నెం. 1887 C/o ఆంధ్రపత్రిక, మద్రాసు-1. వారికి వ్రాయగోరడమైనది.

## టెండరు నోటీసు

### నాగార్జునసాగర్ డామ్

ఎగ్జిక్యూటివు ఇంజనీరు, రైట్ బ్యాంకు కాంప్సు డివిజన్ వారు యీ క్రింది పనులకు డాంసైటు, రైటు బ్యాంకు, పల్నాడు తాలూకా, గుంటూరుజిల్లా యందలి తమ ఆఫీసులో 22-7-57 తేదీన మధ్యాహ్నం 3 గం||ల వరకు సీలు వేసిన టెండర్లు దాఖలు చేసి కొని అదే దినము సా|| 4 గం|| లకు తెరచి పరీక్షింతురు.

టెండరు డాకుమెంట్లు యితర కాగితములు ఆఫీసు పనిచేయు వేళలలో 7-7-57 నుండి 21-7-57 తేదీల మధ్య కాలములో సెట్టు 1 టికి రు. 4.06 వంతున చెల్లించి పొందవలెను. బయానా సొమ్ము బ్యాంకు డ్రాఫ్టు ద్వారా పే అండ్ అకౌంట్సు ఆఫీసరు, రైట్ బ్యాంకు, ఎస్. ఎస్. డాం వారి పేర చెల్లించవలెను.

పనిపేరు: రైటు బ్యాంకు మీద ఆసుపత్రి కట్టుటకు

బయానా మొత్తం: రు. 1,500/-

పనిపూర్తికావలసిన కాలం: ఆరు నెలలు.

కంట్రాక్టు ఫారం:— K-2.

(Sd.) ఏ. వి. రాఘవరాజా
ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు,
రైట్ బ్యాంకు కాంప్సు డివిజన్,
నాగార్జున సాగర డామ్.

### అభినవ తిక్కన సన్మానము

అప్పికట్ల, 14-6-57.

అప్పికట్ల యందలి బోర్డు హైస్కూలులో పది సంవత్సరములనుండి తెలుగు పండితులుగా పనిచేయుచు 17-6-57 వరికైరు కానున్న 'అభినవ తిక్కన' శ్రీ కుమ్మల వీరరాఘవమూర్తి చౌదరి గారికి అప్పికట్ల దాని పరిసర గ్రామములగు పూండ్ల, ఈతేరు, గుడిపూడి, కుట్టిపూడి భర్తిపూడి గ్రామముల యందలి పౌరులు తమకుగల ఆదరాభిమానములు ప్రకటించుటకు ఈ సందర్భమున వారికి ఘనమైన సన్మానము చేయదలచి 14-6-57 న అప్పికట్ల గ్రామములో సభా చేసిరి. ఈ సమావేశంలో ఈ క్రింది పెద్దలతో సన్మానసంఘ మేర్పడినది.

శ్రీయుత అచంటి నాగయ్య (అధ్యక్షులు), కొడాలి చక్రపాణి (కార్యదర్శి), పుట్టా చలమయ్య (కోశాధికారి) ఇనగంటి చౌదరి, అనురాతి వెంకట సుబ్బయ్య, కొసరాజు రాఘవయ్య చౌదరి, పుట్టా వెంకట సుబ్బారావు, ఇనగంటి మూర్తియ్య, వల్లాపల్లి వెంకట సుబ్బయ్య, ఇనగంటి రామకోటయ్య, ఇనగంటి వెంకటప్పయ్య, మున్నా పెదకొండ రామయ్య, పుట్టా నాగయ్య, మున్నా రాఘవయ్య, మున్నా రామమూర్తి, ఆచంటి సుబ్బయ్య, పుట్టా వెంకయ్య, మల్లంపూటి వెంకట సుబ్బయ్య, కరణం వెంకటప్పయ్య, కరణం అంకమ్మ చౌదరి, కోరిటాల వీరయ్య చౌదరి, వట్టికూటి శ్రీరాములు, కొసరాజు రామకోటయ్య, ఇనగంటి రామస్వామి, గరికపాటి నరసింహారావు, గరికపాటి వీరయ్య, కంజేటి సుబ్బయ్య, చింపాటి సుందరరామరాజు, వక్కలగడ్డ వెంకటనారాయణ, మల్లంపాటి వెంకటరత్నం, చెరువు వెంకటేశ్వర్లుగార్లు.

### షార్ట్ హాండ్-కీ-తో-సహ

ఇంగ్లీషురు. 3/- హిందీ రు. 3/-, తెలుగు రు. 3/- తెలుగు ప్రభుత్వ పరీక్షా పత్రములు రు. 3/- పిడుగు శివరామయ్య, టీచరు, ఆదోని.

### వివాహము

ఎం. బి. బి ఎస్ పరీక్ష అయి గౌరవ యాదవ (ఎఱ్ఱగొల్ల) కుటుంబములో పుట్టి, హైదరాబాదుకు చెందిన 25 సం|| యువకునకు అందవతి, విద్యావతి అయిన యాదవ (ఎఱ్ఱగొల్ల) కన్య కావలెను. వివరములకు బాక్సు నెం. 1832/ C/o ఆంధ్రపత్రిక, మద్రాసు-1.

### కావలెను

నెల్లూరుటౌనులో బ్యాంకింగు ఆఫీసులో, ఖాయమైన నెల 1-కి 100/- జీతముగల, మేనేజరు, అర్హతగల వుద్యోగాలు సంపాదించుకొన రూ 600/- క్యాష్ డిపాజిటు చేయగల, స్వంతసైకిలు పెట్టుకోగల,వ్యాపార అనుభవంగల అభ్యర్థులు యీక్రింది అడ్రసుకు 22-7-57 లోపుగా దరఖాస్తులుపంపి 24-7-57 ఉ|| 10కి పెరెక్షన్ డిపాజిట్తో హాజరుకావలెను. సం|| 1-కి రు 4/- ఇంక్రిమెంటు చొప్పున 10 సం||లు ఇవ్వబడును. మొదటినెలలో ట్రైనింగున్నూ, 2-వ నెల నుండి రూ 100/- జీతం ఇవ్వబడును.

K. S. నారాయణ చౌదరి,
కాపువీధి. W 14/217 నెల్లూరు.

### ఆస్తి వేలం

లోగడ ప్రచురింపబడిన విధముగా, తూర్పు గోదావరి జిల్లా రామరాజులంక గ్రామములో పశ్చిమ గోదావరి జిల్లాబోర్డు స్వాధీన హక్కు భుక్తములో ఎ. 2.42 సెంట్లు భూమి అందున్న నానావిధ ఫలవృక్షములు ది 20-5-57 తేదీన బహిరంగ వేలం జరుపబడలేదు సదరు భూమిని నర్సాపురం ట్రావెలర్సు బంగళాలో ది 22-7-57 మధ్యాహ్నం గం 3 లకు తిరిగి వేలం వేయబడును. పాటదారులు, పాట ప్రారంభమందు రు 500/- లు ధరావతు చెల్లించవలయును. మిగతా వివరములు పాట ముందు తెలుసుకొనవలెను.

(సం) కె. సుబ్బరాజు,స్పెషల్ ఆఫీసరు,
పశ్చిమ గోదావరి జిల్లాబోర్డు, ఏలూరు.

### వెంటనే కావలెను.

1. బి. ఏ., బి. యిడి. (బి. ఏ.లో లెక్కలు, ఫిజిక్సు లేక కెమిస్ట్రీ మెయిన్ వుండవలయును.) 2. తెలుగు జూనియర్ పండిట్. 3. పి. టి. ఐ. కం డ్రాయింగు అసిస్టెంటు లేక, 4. (1) పి. టి. ఐ.కం సెకండరీ (2) డ్రాయింగు కం సెకండరీ. 1, 2, 3 ఫారములలో ఖాళీలుగలవు.

సెక్రటరీ & కరస్పాండెంటు
కొండవీటి కమిటీ మిడిల్ స్కూలు
కొత్తరెడ్డిపాలెయం (P. O)
(Via) చేబ్రోలు, గుంటూరుజిల్లా.

### టెండరు నోటీసు

వాల్తేరులోని ఆంధ్ర యూనివర్సిటీ హాస్టలుకు ఈ దిగువ వ్రాసిన సామానులు 10-8-57 నుండి 31-1-58 వరకు సరఫరా చేయుటకు సీలు వేసిన టెండర్లు కావలయును. సదరు టెండర్లు తే 16-7-57 దీ సా|| 4 గంటలలోగా దాఖలుచేయవలెను. వివరములు హాస్టలు ఆఫీసునుండి తెలుసుకొనవచ్చును.

1 సరుకుడు క్రరలు, 2 పాలు, 3 పెరుగు, 4 బియ్యము, 5 వి స్తరాకులు, 6 పప్పులు, మిర్చి, చింతపండు, పోపు సామానులు వగయిరా, 7 మాంసము, కోడి, చేపలు, కోడిగుడ్లు, 8 దేశవాళీ కూరగాయలు 9 ఇంగ్లీషుకూరగాయలు, 10 కాఫీపొడి, 11 వండ్లు.

వాల్తేరు, 26-6-57 | వార్డను

---



---

## హోమియో వైద్య సంస్థ ఏర్పాటు

### తూర్పు గోదావరిజిల్లా హోమియో వైద్యుల విజ్ఞప్తి

రాజమండ్రి, జూలై 1: వైద్యులరిజిస్ట్రేషన్ చట్టాన్ననుసరించి హోమియో వైద్యసంస్థ నేర్పాటు చేయాలని ప్రభుత్వానికి తూర్పు గోదావరిజిల్లా హోమియో వైద్యసంఘ సమావేశం నిన్న విజ్ఞప్తి చేసింది. శ్రీ వి. దీక్షితులు అధ్యక్షత వహించారు.

శీతజ్వర నిరోధం, చికిత్స,విధానాల పై చర్చలు జరిగాయి. శ్రీయుతులు దీక్షితులు, యం. రామకృష్ణరావు, యస్. అప్పారావు, జి. వి. భట్, పి. శ్రీరామమూర్తి, పి. జనార్దనరావు, టి. గోపాలకృష్ణమ్మ, టి. కాశిరాజన్, చర్చలలో పాల్గొన్నారు.

శ్రీ యం. రామకృష్ణారావు వందన మర్పించారు.

## ప్రజా సహకారంతో విదేశీద్రవ్యం పొదుపు

### యర్రగుంట్ల కేంద్రానికి కలెక్టర్ ప్రారంభోత్సవం

ప్రొద్దుటూరు, జూలై 2: కడపజిల్లా యర్రగుంట్ల జాతీయ విస్తరణ కేంద్రానికి జిల్లా కలెక్టరు జనాబ్ సయ్యద్ అహమ్మద్ నిన్న ప్రారంభం చేశారు. సభకు శ్రీ యన్. శంభురెడ్డి అధ్యక్షత వహించారు. ఇది జిల్లాలో 8వ కేంద్రం.

కుమారి లక్ష్మీదేవి ప్రార్థన చేసింది. సుధాకరరాజన్న పద్యాలు చదివాడు. అధ్యక్షుడు మాట్లాడుతూ గ్రామాభివృద్ధి పథకాల అమలుకు ప్రజాసహకారం అర్థించారు. విదేశీద్రవ్యం పై ఆధారపడకుండా ప్రజల శ్రమ, ధన సహాయం మేలని గ్రామాలకు విద్యా, వైద్య, రహదారి సౌకర్యాలు అన్నిటికంటె ముఖ్యమని చెప్పారు. పన్నుల హెచ్చింపు తప్పదని ప్రజలు నిష్పాక్షికంగాను, శాంతంగాను ఆలోచించాలని కోరారు. ప్రతిపక్షాల దుష్ప్రచారానికి లొంగరాదని సూచించారు.

శ్రీ బి. రామారెడ్డి మాట్లాడుతూ పేదప్రజల స్థితిగతుల అభివృద్ధికి ధనికుల పైన పన్నులభారం తప్పదని చెప్పారు. ప్రజలు ఐక్యతతో వ్యవహరిస్తే అధికారులలో అవినీతి నిర్మూలించవచ్చునన్నారు. గ్రామకక్షలు కూడదని హితవు చెప్పారు. ఇందుకు యువకులు ముందుకు రావాలని కోరారు.

శ్రీ రాంసింగ్ ప్రసంగిస్తూ కడప జిల్లాకు 8 కేంద్రాలు మంజూరు కావడం ప్రజా సహకారానికి నిదర్శనమన్నారు. జిల్లాలో అభివృద్ధి పనులకు రు 50 లక్షలు ఖర్చయినవని తెలిపారు.

జనాబ్ సయ్యద్ అహమ్మద్ మాట్లాడుతూ కేంద్రం మంజూరుకై శ్రీ శంభురెడ్డి చేసిన కృషిని ప్రశంసించారు. శ్రీ జి. జయరామిరెడ్డి వందన మర్పించారు.

సర్వోదయ నాటక సమాజం "మానవుడు" నాటకం ప్రదర్శించారు.

(స్వ. వి.)

## ఉద్యోగులూ-ఉద్యోగాల

హైదరాబాదు, జూలై 1: వ్యవసాయ శాఖ డెప్యూటీ కార్యదర్శి శ్రీ ఎస్. జి. అప్పారావు గారికి 3 నెలల సెలవు మంజూరయింది. సెలవు తరువాత ఆయన ఉద్యోగం నుంచి విరమిస్తారు.

శ్రీ జి. గురుమూర్తి తూర్పుగోదావరి జిల్లా అసిస్టెంట్ సెషన్సు జడ్జిగా నియమితులయినారు.

శ్రీకాకుళంజిల్లా వాణిజ్య పన్నుల శాఖాధికారి శ్రీ వి. రంగమూర్తి తెనాలికి బదిలీ అయినారు. ఆయనకు బదులు శ్రీకాకుళం జిల్లా వాణిజ్య పన్నుల శాఖాధికారిగా శ్రీ బి. భీమరాజ్ నియమితులయినారు. తెనాలి వాణిజ్య పన్నుల శాఖాధికారి శ్రీ టి. వి. వీరరాఘవులు చెట్టి అనంతపురం మండలం వాణిజ్య పన్నులశాఖ సహాయాధికారిగా బదిలీ అయినారు.

సెలవు పూర్తి అయిన తరువాత గుంటూరు వాణిజ్యపన్ను శాఖాధికారిగా శ్రీ ఇ. వేణుగోపాలరాయుడికి బదులు శ్రీ కె. వంకటరెడ్డి పనిచేస్తారు.

శ్రీ ఇ. వేణుగోపాలరాయుడు కడపకు బదిలీ అయినారు.

విశాఖపట్టణంలోని కింగ్ జార్జి ఆసుపత్రిలో డాక్టరు వి. వి. ప్రసాదరావు ఒక సంవత్సరంపాటు గౌరవ హోదాలో పనిచేస్తారు. నెలకు రు 150 గౌరవభృతి ఇస్తారు.

హైదరాబాదులోని సహకార సంఘాల రిజిస్ట్రారు కార్యాలయంలో వ్యవసాయశాఖ డెప్యూటీ డైరెక్టరుగా పనిచేస్తున్న శ్రీ ఎమ్. జీవన్ రావుకి ఒక నెల సెలవు మంజూరయింది.

హైదరాబాదు మండల వాణిజ్య పన్నులశాఖ డెప్యూటీ కమీషనరుగా శ్రీ పి. సాంబమూర్తి నియమితులయినారు. వరంగల్లు మండలం వాణిజ్య పన్నులశాఖ డెప్యూటీ కమీషనరుగా శ్రీ శంకర్ జీ వ్యవహరిస్తారు.

నిజామాబాదు మండల వాణిజ్య పన్నులశాఖ డెప్యూటీ కమీషనరుగా శ్రీ పి. ఎస్. రెడ్డి పనిచేస్తారు.

నాగర కర్నూలు డెప్యూటీ కలెక్టరు శ్రీ శ్రీ రామ్ భూపాల్కి 82 రోజుల సెలవు మంజూరయింది. ఆయనకు బదులు నాగరకర్నూలు డెప్యూటీ కలెక్టరుగా తాత్కాలికంగా మహబూబ్ నగరం తహసీల్దారు శ్రీ కె. నరసింహారావు పని చేస్తారు.

## చెరువులలో చేపల పంట

### బెంగుళూరు శాస్త్రజ్ఞుల పరిశోధన

మద్రాసు, జూలై 3: బెంగుళూరు శాస్త్రజ్ఞులిద్దరు పరిశోధన కేంద్రంలో చెరువుల్లో పెరిగే చేపలు కృతిమ పద్ధతుల్లో గుడ్లు పెట్టే లాగున చేయగలిగారు. డా|| యల్ యస్. రామస్వామి, డా||చి. వి. సౌందరాజ్ అనే యీ శాస్త్రజ్ఞులు కేంద్ర విద్యాశాఖ మంత్రిత్వ సహాయంతో మామూలుగా నదుల్లో పెరిగే చేపలను చెరువుల్లో పెంచే పథకం గూర్చి పరిశోధన చేస్తున్నారు. అయితే యీ రకం చేపలు తినటానికి పనికిరావని కొందరి అభిప్రాయం. మరికొందరు తినవచ్చునని అభిప్రాయపడుతున్నారు. ఈ పథకం జయప్రదమైతే తినటానికి ఉపయోగించే మంచినీటి చేపల ఉత్పత్తి చాలా ఎక్కువ అవుతుంది.

## వైఖానస ఆగమ పరీక్షా ఫలితాలు

తిరుపతి, జూలై 3: శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో ఈ ఏడాది ఏప్రిల్లో జరిగిన వైఖానస ఆగమ పరీక్షలలో ఈ దిగువ సూచించిన సంఖ్యలు కలిగిన అభ్యర్థులు ఉత్తీర్ణులు అయ్యారు:

**ప్రవేశ**

మొదటి తరగతి: లేరు.

రెండవ తరగతి: 11 14 15 43 57 62.

మూడవ తరగతి: 1 నుంచి 6 10 13 18 16 నుంచి 19 22 నుంచి 25 27 నుంచి 31 35 నుంచి 38 40 41 44 48 నుంచి 51 53 55 56 58 59 61 63 65 నుంచి 69 71 నుంచి 74 76 నుంచి 78 81 82 84 నుంచి 88 92 నుంచి 96 98 99 101 103 నుంచి 104 106 నుంచి 109 111 నుంచి 118 118 నుంచి 126.

**వర:**

మొదటి తరగతి: లేరు.

రెండవ తరగతి: 1 28 36 48 111 119 120.

మూడవ తరగతి: 20 37 74 నుంచి 76.

**ప్రవర**

మొదటి తరగతి: లేదు.

రెండవ తరగతి: 48 111.

మూడవ తరగతి: 120 మాత్రం.

## ప్రాథమిక పాఠశాలల పాఠ్య గ్రంథాలు

కర్నూలు, జూలై 2: స్థానిక సంస్థలు నిర్వహించే ప్రాథమిక పాఠశాలలలో బోధనకు నిర్ణయించవలసివున్న పుస్తకాలను (ప్రాంతీయ ప్రాతిపదిక)ప్రచురణకర్తలు పరిశీలన నిమిత్తం తగు వివరాలతో సెప్టెంబరు 3 లోగా పంపాలని ప్రభుత్వ పరీక్షల కమీషనరు కార్యదర్శి ప్రకటిస్తున్నారు.

### మాల్కమ్ మాక్డొనాల్డ్

హైదరాబాదు, జూలై 3: భారత దేశంలోని బ్రిటిష్ హైకమీషనరు శ్రీ మాల్కమ్ మాక్డొనాల్డ్ ఇవాళ్ళ ఇక్కడికి వచ్చారు. రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎమ్.వి. పాయ్, గవర్నరు సైనిక కార్యదర్శి,నగరపోలీసు కమీషనరు శ్రీ విజయరంగం స్వాగతం చెప్పారు. గవర్నరుకు అతిథిగా రాజభవనంలో శ్రీ మాక్డొనాల్డ్ మకాం చేస్తున్నారు.

### ఉస్మానియా విశ్వ విద్యాలయం

హైదరాబాదు, జూలై 3: హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాలలో శీతజ్వరం ఎక్కువగా ఉన్నందున ఉస్మానియా విశ్వవిద్యాలయం తరగతులలో పాఠాలు ఈ నెల 8 తేదీ వరకూ ప్రారంభం కావు.

### సివిల్ ఇంజనీరింగు పరీక్షలు

కర్నూలు, జూన్ 28: లాయ్యర్ సెకండరీ సర్టిఫికేట్ పరీక్షలో విడి విడిగా (భాగాలవారీగా) ఉత్తీర్ణులైన కారణానగాని సర్వీసు కమీషన్ నిర్ణయించిన మార్కులురాలేదన్న కారణానగాని ఏప్రిల్లో జరిగిన సివిల్ ఇంజనీరింగు లోయరు గ్రేడ్ పరీక్షలకు హాజరుకాలేకపోయిన అభ్యర్థులకు హైదరాబాదులో యీనెల 28 నుంచి 31 వరకు తిరిగి పరీక్షలు జరుగగలవని, వేరే క్రొత్తగా రుసుం కట్టనవసరం లేకుండా లోయర్ గ్రేడ్కు హాజరు కావచ్చుని ప్రభుత్వ పరీక్షల డిప్యూటీ కమీషనరు ప్రకటిస్తున్నారు. పరీక్షలు జరిగేస్థలం వివరాలు అభ్యర్థులకు తెలియజేస్తారు.

హైదరాబాదు, జూలై 2: ఈ నెల 28 నుంచీ వచ్చేనెల 11 వ తేదీదాకా మాస్కోలో జరుగనున్న ఆరవ ప్రపంచ యువజనోత్సవాలకు పరిశీలకులుగా పదిమందిని తమ సంఘం తరఫున పంపిస్తామని భారత జాతీయ విద్యార్థి సంఘం అధ్యక్షుడు శ్రీ జి. మనోహరరావు చెప్పారు. ఈ సంఘం పంపించే పరిశీలకులలో హైదరాబాదు ప్రతినిధులు ముగ్గురుంటారు.

క్రీడా రంగం:

# వింబుల్డన్ ఫైనల్లో హోడ్, కూపర్లకు పోటీ

## సెమి ఫైనల్లో ఫ్రేజర్, డేవిడ్సన్ల ఓటమి

లండన్, జూలై 3: వింబుల్డన్ లాన్ టెన్నిస్ ఛాంపియన్ షిప్సు పురుషుల సింగిల్సు ఫైనల్లో ఎల్. ఎ. హోడ్కు ఎ. జె. కూపర్కు పోటీ జరుగుతుంది. ఇరువురు ఆస్ట్రేలియా ఆటగాళ్ళు. ఈ రోజున మొదటి సెమి ఫైనల్లో ఎ. జె. కూపర్ 1-6, 14-12 6-3, 8-6 స్కోరుతో ఎన్. ఎ. ఫ్రేజర్ (ఆస్ట్రేలియా)ను ఓడించారు. రెండవ సెమిఫైనల్లో క్రిందటిఏడాది ఛాంపియన్ షిప్ గెలుపొందిన ఎల్. ఎ. హోడ్ 6-4, 6-4, 7-5 స్కోరుతో ఎస్. డేవిడ్సన్ (స్వీడన్)ను ఓడించారు.

పురుషుల డబుల్సు క్వార్టర్ ఫైనల్లో ఎన్. పట్రోతాంజలి, ఓ. శిరోలా (ఇటలీ) 6-3, 9-7, 6-4 స్కోరుతో ఆర్. ఎమర్సన్, ఆర్. మార్క్ (ఆస్ట్రేలియా)లను ఓడించారు.

మిక్సెడ్ డబుల్సులో నరేష్ కుమార్ (భారతదేశం), కుమారి ఇ. బూడింగ్ (జర్మనీ) 6-2, 5-7, 6-3 స్కోరుతో ఆర్.కృష్ణన్(భారతదేశం), శ్రీమతి ఇ సి. యస్. ప్రాట్ (సంయుక్త రాష్ట్రాలు)లను ఓడించి క్వార్టర్ ఫైనల్లో ప్రవేశించారు.

స్త్రీల డబుల్సు క్వార్టర్ సెమి ఫైనల్ ఫలితాలు ఇలా ఉన్నవి: కుమారి ఎ. గిబ్సన్, కుమారి డి. ఆర్. హార్డ్ (సంయుక్త రాష్ట్రాలు) 6-3, 6-0 స్కోరుతో కుమారి పి. ఎ. వార్డ్, కుమారి ఎ. మార్టిమర్ (బ్రిటన్) లను ఓడించారు. శ్రీమతి కె. హాటన్, శ్రీమతి టి. డి. లాంగ్ (ఆస్ట్రేలియా) 7-5, 6-2 స్కోరుతో కుమారి ఎస్. జె. బ్లూమర్ (బ్రిటన్), శ్రీమతి ఇ. సి. ఎస్. ప్రాట్ (సంయుక్త రాష్ట్రాలు) లను ఓడించారు.

## ఆంధ్ర వ్యాయామ విద్యా శిక్షణ కళాశాల

విజయవాడ, జూలై 3: ఇక్కడి ఆంధ్ర వ్యాయామ విద్యా శిక్షణకళాశాల పాలకవర్గం ఈ సంవత్సరం నుంచి వ్యాయామ విద్యలో డిప్లొమా కోర్సు ప్రారంభించడానికి నిశ్చయించారు.

ఈ కోర్సు ప్రారంభించడానికి ఆంధ్ర విశ్వవిద్యాలయం సమ్మతించినట్లు తెలుస్తున్నది. కోర్సు ప్రారంభించడానికి కళాశాలలో ఉన్న సౌకర్యాలు పరిశీలించి నివేదిక సమర్పించే నిమిత్తం విశ్వవిద్యాలయం మద్రాసులోని వై. ఎమ్. సి. ఎ. వ్యాయామ కళాశాల ప్రధానోపన్యాసకులు శ్రీ ఎస్. డి. భోస్లేను కమీషనరుగా నియమించినట్లు కూడా తెలుస్తున్నది.

కమీషనరు కళాశాలను జూలై 18 వ తేదీని దర్శిస్తారు. కోర్సు ఆగస్టు 1 వ తేదీనుంచి ప్రారంభం అవుతుంది.

## సూడాన్ ఫుట్బాల్ జట్టుపై కలకత్తా జట్టు గెలుపు

కలకత్తా, జూలై 3: భారత ఫుట్ బాల్ సంఘం జట్టు నేటిసాయంకాలం ఇక్కడ జరిగిన ఎగ్జిబిషన్ ఆటలో 3-1 స్కోరుతో సూడాన్ ఫుట్ బాల్ జట్టును ఓడించారు.

బొంబాయి జట్టుపై చెప్పుకోదగిన విజయం సాధించిన సూడాన్ జట్టు ఈ రోజున ఎదిరిపక్షంవారి దాడులు నిరోధించలేకపోయారు. సూడాన్ తరఫున రైట్ ఇన్ బురీ అహమ్మద్, లెఫ్ట్ ఇన్ సిద్దిక్ మంజూల్, లెఫ్ట్ హాఫ్ హాసన్ యూసఫ్ మాత్రం బాగా ఆడారు. కలకత్తా జట్టులో రైట్ బాక్ అబ్దుల్ రహమాన్, సెంటర్ ఫార్వర్డ్ ఉమర్ విశేషమైన ప్రతిభ ప్రదర్శించారు. కలకత్తా జట్టు కలసి కట్టుగా ఆడి గోలు చేయడానికి లభించిన అవకాశాలు చక్కగా వినియోగించుకొన్నారు.

సూడాన్ తరఫున మొదట సిద్దిక్ మంజూల్ గోలుచేశారు. కలకత్తా తరఫున బలరాం, ఉమర్, బనర్జీ గోల్సు చేశారు.

సూడాన్ జట్టు: ఫైజల్ అల్ సయ్యద్, ఉస్మాన్ అబ్దుల్ లతీఫ్, మన్సూర్ రమజాన్, ఉమర్ రాహీమ్, హాసన్ యూసఫ్, హాసన్ మహమ్మద్, బురీ అహమ్మద్, ఉస్మాన్, సిద్దిక్ మంజూల్, సాకి.

భారత ఫుట్ బాల్ సంఘం జట్టు: సేర్, అబ్దుల్ రహమాన్, మన్నా, కెంపయ్య, అహమ్మద్ హుస్సేన్, రామ్బహదూర్, పి. కె. బనర్జీ, సి. గోస్వామి, ఉమర్, బలరాం, ఎస్. రాయ్.

మాస్కో యువజనోత్సవాలకు

### ఆంధ్ర వెయిట్ లిఫ్టర్స్

విజయవాడ, జూలై 3: అంతర్జాతీయ యువజనోత్సవాల సందర్భంలో మాస్కోలో జూలై 29 వ తేదీనుంచి వెయిట్ లిఫ్టింగ్ పోటీలు జరుగనున్నవి. ఆంధ్రప్రదేశ్ తరఫున ఆ పోటీలలో పాల్గొనగోరువారు వివరాలకు ఆంధ్రప్రదేశ్ ఎమెచ్యూర్ వెయిట్ లిఫ్టింగ్ సంఘం, గాంధీనగరం, విజయవాడ-1, చిరునామాకు వ్రాయవలయునని కార్యదర్శి శ్రీ చెన్నుపాటి రామకోటయ్య ప్రకటిస్తున్నారు.

మలయా స్వతంత్ర ఉత్సవాల సందర్భంలో జరిగే పోటీలలో పాల్గొనగోరు వారుకూడా వివరాలకు వ్రాయవచ్చునని ఆయన సూచిస్తున్నారు.

## ఆకాశవాణి

శనివారం, జూలై 6

**హైదరాబాద్**

(411 మీటర్లు)

ఉ|| 6-50 సుప్రభాత్ 7 తె. వా. 7-15 పి. విశ్వనాథం 7-45 క. వా. 8 ఆం. వా. 8-15 హిం. వా. 8-30 భజన్ 8-45 సుగమ్ సంగీత్.

మ|| 12-30 ఫిల్మ్ గానే 12.50 మ. వా. 1 వనితావాణి (విజయవాడనుంచి రిలే) 1-30 ఫిల్మ్ గీతాలు 1-50 తె. వా. 2 ప్రసార సమాప్తి 4 చాలా నందం.

సా|| 5-30 శాస్త్రీయ సంగీత్ 5-45 కర్ణాటక సంగీతపాఠం 6 స్థానిక ప్రకటనలు 6-05 ప్రాంతీయ వా. 6-15 గ్రామసీమ 7 తె. వా. 7-15 గ్రామసీమ (విజయవాడనుంచి రిలే) 7-30 సంస్కృతీ చిహ్నములు (విజయవాడనుంచి రిలే) 7-45 గీతావళి 8 ఆంగ్ల ప్రసంగం (న్యాయమూర్తి టి. ఎల్. వెంకట్రామ అయ్యర్) 8-15 పంస్కృతి కార్యక్రమం 8-30 ఆకాశవాణి వార్తా సమీక్ష 8-40 వాద్య బృందం 8-45 ప్రసంగం (ఉర్దూ) 9 ఆం. వా. 9-15 ఉ. వా. 9-30 అఖిలభారత సంగీత కార్యక్రమం (ఢిల్లీ నుంచి రిలే) 11 ప్రసార సమాప్తి.

**విజయవాడ**

(857.1 మీటర్లు)

ఉ|| 6-30 శుభోదయం 6-35 ప్రసార విశేషాలు, 6-40 భక్తిరంజని 7 తె వా. 7-15 బొమ్మరిల్లు 8 ఆం వా. 8-15 హిం వా.

మ|| 1 వనితావాణి 1-30 వాద్య సంగీతం 1-40 హిం. వా. 1-50 తెవా.

సా|| 5-30 కదంబలారామన్ 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా. 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తె వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 సంస్కృతీ చిహ్నములు (ప్రసంగం) 7-45 ఫిల్మ్ గీతాలు 8 కదంబలారామన్ 8-30 ఆకాశవాణి వార్తాసమీక్ష 8-40 గీతమంజరి 9 ఆం. వా. 9-15 వీణ 9-30 అఖిల భారత సంగీత కార్యక్రమం (ఢిల్లీనుంచి రిలే) 11 ప్రసారసమాప్తి.

**మద్రాసు (ఎ)**

(819.1 మీటర్లు)

ఉ|| 6-50 స్వాగతం, 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్య సమ్మేళనం 7.15 త. వా. 7-30 కె. ఎస్. కృష్ణన్.

మ|| 1 వనితావాణి (విజయవాడనుంచి రిలే) 1-30 గీతమంజరి 1-40 హిం. వా. 1-50 గీతమాలిక 2. త. వా. 2-10 వి. వరి 2-15 గోపాల కృష్ణ భారతి కృతులు 2-45 సుగమ్ సంగీత్.

సా|| 5 పాశ్చాత్య సంగీతం 5-30 వీణ వి. ఎస్. రామస్వామి 6-05 ప్రాంతీయ వా. 6-15 కె. ఎస్. కృష్ణన్ 6-45 జి. సుబ్బలక్ష్మి 7-15 త. వా. 7-30 తమిళ నాటిక 8-30 సుగమ్ సంగీత్ 8 45 మైథిలీ నాగేశ్వరన్ 9-45 పాశ్చాత్య సంగీతం 10-30 ప్రసార సమాప్తి.

**మద్రాస్ (బి)**

(311. 8, 41. 83 మీటర్లు)

ఉ|| 6-50 ఎవరి, 7 తె. వా. 7-15 బొమ్మరిల్లు (విజయవాడనుంచి రిలే), 8 ఆం. వా.

(211. 8, 31. 38 మీటర్లు)

మ|| 1 గీతమాలిక, 1-30 ఆం. వా. 1-40 గీతమంజరి, 1-50 తె. వా. 2 వీణ, 2-15 శంకర నిగమ్.

(211.8, 49. 30 మీటర్లు)

సా|| 5 ఎవరి, 5-50 స్థానిక ప్రకటనలు, 6 ఆం. వా. 6-05 ప్రాంతీయ వార్తలు, 6-15 గ్రామస్థుల కార్యక్రమం, 7 తె. వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమం, 7-30 సంస్కృతీ చిహ్నములు (విజయవాడనుంచి రిలే), 7.45 టి. ఎస్. వేదాంతం. టి. ఎస్. వీరరాఘవన్, 8-30 ఆకాశవాణి వార్తాసమీక్ష, 8-40 విరామ సంగీతం, 8-45 తమిళ ప్రసంగం (తిరుచ్చినుంచి రిలే), 9 ఆం. వా. 9-15 మద్రాసు రాష్ట్ర అభివృద్ధి ప్రణాళికలు (ప్రసంగం), 9-30 అఖిలభారత సంగీత కార్యక్రమం (ఢిల్లీనుంచిరిలే), 11 ప్రసార సమాప్తి.

## రాష్ట్రమంతటా చౌక అంగళ్లు ఉండాలి

### హైదరాబాదు సభ విజ్ఞప్తి

హైదరాబాదు, జూలై 3: రాష్ట్రంలోని పట్టణాలన్నింటిలోనూ చవక దుకాణాలను ఏర్పాటు చేయించి, ఆహార ధాన్యాలను సప్లయి చేయించవలసినదిగా ప్రభుత్వానికి ఇక్కడ జరిగిన బహిరంగసభ విజ్ఞప్తి చేసింది. నగరంలోని 12 కార్మిక సంఘాల ఆధ్వర్యాన ఈ సభ జరిగింది. రాజ్యసభ సభ్యుడు డాక్టరు రాజబహాదూర్ గౌడ్ అధ్యక్షత వహించారు.

ఈ సందర్భంలో ప్రభుత్వం వద్దకు రాయబారం వెళ్ళేందుకు అయిదుగురు సభ్యులతో ఒక సంఘాన్ని నియమించారు.

శ్రీయుతులు కె. ఎల్. నరసింహం, రావి నారాయణరెడ్డిగారలు కూడా ప్రసంగించారు.

చవక దుకాణాల నిర్వహణను ఆయా పట్టణాల పురపాలక సంఘాలకు ఇవ్వవలసినదిగా తీర్మానంలో ప్రభుత్వానికి సూచించారు. చవక దుకాణాల ద్వారా ఆహార ధాన్యాల పంపిణీని అజమాయిషీ చేసేందుకు 'ప్రాంతీయ సంఘాలను' ఏర్పాటు చేయవలసినదిగా కూడా కోరారు.

ఆహార ధాన్యాల ధరలు పెరగడం వల్ల చాలా చిక్కు పరిస్థితు లేర్పడినవి. ఖర్చులు తగ్గించేందుకు ప్రభుత్వం చేస్తున్న ఏర్పాట్లన్నీ 'కళ్ళనీళ్ళు తుడుపు' వ్యవహారంగా తయారయినవని డాక్టరు రాజబహదూర్ గౌడ్ అన్నారు.

## సారానేరానికి 37 మంది అరెస్టు

కాళహస్తి, జూలై 2: చిత్తూరు పట్టణ పోలీసు ఇన్స్పెక్టరు శ్రీ పి. వెంకన్న, రిజర్వు పోలీసు సిబ్బందితో జూన్ 25 వ తేదీని తొట్టపాళెం, శ్రీ రాజాగార్ల గ్రామాలలో దాడిజరిపి, మద్యనిషేధచట్టం ఉల్లంఘించిన నేరం మీద 18 మందిని అరెస్టు చేశారు.

జూన్ 24 న పోలీసు అధికారులు 10 మందిని అరెస్టు చేసి వారివద్ద 20 గాలన్ల సారా, 450 గాలన్ల ఊట వశపరచు కొన్నారు.

మద్యనిషేధ చట్టం ఉల్లంఘించిన నేరాలకుగాను పోలీసు అధికారులు 20 వ తేదిని 8 మందిని, 19 న మరి ఆరుగురిని అరెస్టు చేశారు. (స్వ. వి.)

## అక్కౌంట్ పరీక్షలు

కర్నూలు, జూలై 3: సెకండరీ పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు, ప్రధానోపాధ్యాయినులకు అక్కౌంట్ పరీక్షలు యీనెల 29, 30 తేదీలలో జరుగుతాయని వివరాలకు జూన్ 6 తేదీ గెజట్ చూడాలని ప్రభుత్వ పరీక్షల డిప్యూటీ కమీషనరు ప్రకటిస్తున్నారు.

### దక్షిణ రైల్వే సిబ్బంది సమావేశం

విజయవాడ, జూలై 1: దక్షిణ రైల్వే సిబ్బంది సంఘ ప్రత్యేక సర్వ సభ్య సమావేశం యీనెల 16, 17 తేదీలలో హుబ్లీలో జరుగుతుంది. రైల్వే సిబ్బందికి చెందిన రెండు సంఘాల విలీనీకరణను వీరు ధృవపరుస్తారని సంఘ కార్యదర్శి శ్రీ జి. యల్. నరసింగరావు ప్రకటిస్తున్నారు.

### తెనాలి తాలూకా గ్రామోద్యోగుల సమావేశం

తెనాలి, జూలై 3: తెనాలితాలూకా గ్రామోద్యోగుల సంఘ అత్యవసరసమావేశం ఇక్కడ జూలై 7 వ తేదీ మధ్యాహ్నం జరుగుతుందని అధ్యక్షుడు శ్రీ అవుల వెంకటరత్నం చౌదరి తెలియపరచుచున్నారు.

## మదరాసు ధరలు

మదరాసు, జూలై 4:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎడ్వర్డుకొన్నా సేల్సుటాక్సుతో సహా రు. 70.75

| | |
|---|---|
| మేల్బంగారం తులం రు. | 107.00 |
| మూసా బంగారం తులం రు. | 105.75 |
| సీమవెండి తులం 100కి రెడీ | 168.75 |
| చిల్లర ధర రు. | 1.87 |

**వేరుశనగ**

(551 పా|| 1-కి ఎక్సుపోర్టు గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా)

| | |
|---|---|
| డిసెంబరు రు. | 165-170 |
| వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ మిల్లో % పా.) రెడీ చిల్లర ధర | 886.00 |

(ఎక్సుపెల్లర్ కి రు. 25, సేల్సుటాక్సు, ఎక్సుసైజ్ సుంకంతో సహా)

50 టెంకాయనూనె (87½ వీసెలు సేల్సుటాక్సు అదనం,

| | |
|---|---|
| ఆంబురాక్కు రు. | 81.00 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 81.50 |
| రాజా రు. | 81.00 |

**ఆముదం**

| | |
|---|---|
| తిరుపత్తూరు (500 పా.) రు. | 345.00 |

**పంచదార**

| | |
|---|---|
| సేలం లోటస్ క్యాండ్ (87½ పా) | 26.00 |
| అనకాపల్లి (226 పా.) | 109.71 |
| కొవ్వూరు (229 పా.) | 110-.79 |

## న్యూయార్కు దూది

### అక్టోబరు వాయిదా ధరలు

న్యూయార్కు, జూలై 3: న్యూయార్కు, కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి:

| | |
|---|---|
| నేటి ప్రారంభ ధర | 35.28 |
| నేటి ముగింపు ధర | 35.11 |



### టెండరు నోటీసు

గుంటూరు జిల్లా తెనాలి తాలూకా చేముడుబాడు గ్రామములో వేంచేసి యున్న శ్రీ లింగోద్భవస్వామివారి దేవస్థానము తాలూకు ట్రస్టీ స్వాధీనములో నున్న తేరి, మెరక, ఈనాము,మాగాణి భూములయిన 4 య. 60 సెంట్లు 5 సం|| లకు కౌలు హక్కును పొందదలచిన వారు సీలు వేసిన టెండర్లను మేనేజింగ్ ట్రస్టీగారిచే 12-7-57 తారీకున ఉదయం 11 గం||ల వరకు తీసుకొనబడును. ప్రతి టెండరుదారు టెండరులో పాటు ధరావత్తు క్రింద 100-0-0 మేనేజింగ్ ట్రస్టీగారికి చెల్లించవలెను. ఆ రోజునే సాయంకాలము 5 గంటలకు H. R. E. బోర్డు ఇన్స్పెక్టరు ఆఫీసులో (మారీసుపేట తెనాలిలో) ఇన్స్పెక్టరు గారి ఎదుట తెరువబడును. పాట షరతులు, భూముల వివరములు మేనేజింగు ట్రస్టీ గారి దగ్గర తెలుసుకొనవచ్చును.

చేముడుబాడు, 2-7-57 } బావలి వాలయ్య, మేనేజింగ్ ట్రస్టీ.

### నాగార్జునసాగర్ డామ్

### చిట్ టెండరు నోటీసు

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, డామ్ కన్స్ట్రక్షన్ డివిజన్ నెం. II విజయపురి (దక్షిణం), గుంటూరుజిల్లా,ఆంధ్రప్రదేశ్ వారు విజయపురి (దక్షిణం) నందలి వారి ఆఫీసులో 20-7-57 తేదీన మధ్యాహ్నం 3 గం||ల వరకు సీలువేసిన టెండర్లు దాఖలుచేసికొని, ఆదేదినము సా|| 4 గం||లకు తెరచి పరీక్షింతురు.

టెండరు ఫారములు, యితర డాకుమెంట్లు పైవారినుండి 9-7-57 తేదీనుండి రు 5.08 వంతున చెల్లించి పొందవచ్చును.

పనిపేరు: నాన్స్పిల్ వే భాగములో చెయిన్ 125-00 నుండి చెయిన్ 126-00 వరకు గల రీచ్ (భాగము)లో పునాదుల త్రవ్వకము పనులు. డిపాజిటు చేయవలసిన బయానా: రు. 9,000/- పని పూర్తిచేయవలసిన కాలము 6 నెలలు.

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు,
డామ్ కన్స్ట్రక్షన్ డివిజన్ నెం 2.
నాగార్జునసాగర్ డామ్.

### ప్రకటన

భీమవరం మునిసిపాలిటీ

1957-58 వ సంవత్సరమునకు భీమవరం మునిసిపాలిటీకి అవసరమైన ప్రింటింగు మరియు బైండింగుపనులు చేయుటకు సీలువేసిన టెండర్లు మున్సిపల్ కమీషనరు గారిచే ది 10-7-57 వ తేది సాయంకాలం (నాలుగు) 4 గంటల వరకు తీసుకొనబడును.

టెండరు దాఖలు చేయువారు ముందుగా రు. 50/- ధరావతు చెల్లించి టెండరుతో పంపించ వలయును. టెండరు ఫారం, షరతులు మున్సిపల్ ఆఫీసు నుండి పొందవచ్చును.

భీమవరం, 1-7-57. } టి. సత్యనారాయణ, కమీషనరు.

### నోటీసు

బొంబాయి ఏషియాటిక్ అష్యూరెన్సు కంపెనీ లిమిటెడ్ వారిచే పొన్నూరి సుబ్బారావు పేర యిచ్చిన పాలిసీ నెం 88021 పోయినదని నోటీసు వచ్చినందున, యీపాలిసీ విషయములో యెవరికైన ఎట్టి హక్కులుగాని ఉన్నయెడల యీ నోటీసు ప్రకటించిన 30 రోజుల లోగా ఇన్ష్యూరెన్సు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా కంపెనీకి తెలుపుకొనవలెను. అట్లు తగిన నిదర్శనములతో ఆక్షేపణలు సకాలమునకు అందనంతట, సదరు పాలిసీమీద సొయము మంజూరు చేసి, దానిమీద రావలసిన సొమ్ము పాలిసీదారునకు చెల్లింపబడును.

డి. ఎస్. మెహతా,
జోనల్ మేనేజరు, లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా,
బెస్టర్న్ జోన్, బొంబాయి. 2-7-57

# ద్వితీయ ప్రణాళికలో నూతన పథకాలు

## విదేశ ద్రవ్య అవసరం తగ్గేపద్ధతిలో ఆలోచన

న్యూఢిల్లీ, జూలై 2: ఇనుము, ఉక్కు, బొగ్గు, రవాణా ఈ పరిశ్రమలకు సంబంధించిన విద్యుత్ సరఫరా రంగాలు మినహా విదేశమారక ద్రవ్యం అవసరంలేని నూతన పథకాలకే స్థానం ఇచ్చే రీతిని ద్వితీయ ప్రణాళికను పునఃపరిశీలన చేస్తున్నట్లు తెలుస్తోంది.

ప్రణాళికా సంఘం విదేశ మారక ద్రవ్య పరిస్థితితో ప్రణాళికను ఎల్లప్పుడూ పరిశీలన జరుపుతోంది. ఇప్పుడు దిగుమతులను తగ్గించారు; ప్రణాళికలోని ఇనుము, ఉక్కు, బొగ్గు, రవాణా, వీటికి అవసరమైన విద్యుత్ సరఫరా పథకాలను అమలు పరచేందుకు అవసరమైన భారీ యంత్రాల పరికరాలను మాత్రమే దిగుమతి చేసికోవాలని నిర్ణయించారు. ఐతే, వీటిని అమలు చేసేందుకు ఇంతవరకూ మాట ఇచ్చిన సొమ్ముకన్నా అరు వందల కోట్ల రూపాయలు విదేశ సహాయం అవసరం కాగలదని అంచనా వేశారు. ఈసహాయంలో ఎంతవచ్చేదీ, ఎప్పుడు వచ్చేదీ తెలియదు. అందువల్ల పరిస్థితి మెరుగయ్యేవరకూ విదేశ ద్రవ్యం అవసరమయ్యే నూతన పథకాలకు స్థానం ఈయరాదని నిర్ణయించారు. అదీకాక, ప్రణాళికలోని పథకాలను అమలుచేయడానికి విదేశ ద్రవ్యార్జనకు మహత్తర కృషి చేయవలసి ఉంది. ఇతర రంగాలలో విదేశ ద్రవ్యం అవసరాన్ని సాధ్యమైనంతవరకూ తగ్గించి, ఈ ద్రవ్య సంపాదనకు వీలైన సమస్త అవకాశాలను విస్తృతం చేయవలసి ఉంది. రాష్ట్రాలు కూడా ప్రణాళికను అమలు చేయడంలో వీలైనంతవరకూ ధనార్జన చేయాలని ప్రణాళికా సంఘం స్పష్టం చేస్తోంది. క్రిందటి సంవత్సరం విదేశ మారక ద్రవ్యాన్ని అధికంగా వినియోగించడంవల్ల ఈ సంవత్సరం మే నెలాఖరుకు ఈ నిల్వలు 335 కోట్ల రూపాయలకు తగ్గిపోయాయి. రిజర్వుబ్యాంకు నిధులలో సుమారు 275 కోట్ల రూపాయలు తరుగు ఏర్పడిందని కూడా తెలుస్తోంది. ఈ కాలంలో అంతర్జాతీయ ద్రవ్యనిధి నుండి 6070 లక్షల రూపాయలను ఋణంగా తీసికొన్నారు. ప్రథమ ప్రణాళిక కాలంలో మొత్తం మీద నిధులలో 138 కోట్ల రూపాయల తరుగు ఏర్పడింది. ఐతే, విదేశ ద్రవ్యార్జనలో ప్రస్తుత క్లిష్టపరిస్థితిని దాటగలమనీ, ప్రణికలోని పథకాలను అమలు చేయడంలో అడ్డంకులు ఏమీ ఏర్పడవనీ అధికారులు విశ్వసిస్తున్నారు. ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ బ్రిటన్ పర్యటనవల్లా, ఆర్థిక మంత్రి కృష్ణమాచారి అమెరికా పర్యటనవల్లా నేటి అవాంతర పరిస్థితి దాటిపోగలమని వీరు భావిస్తున్నారు.

### కంపెనీ నిర్వహణ శాఖకు ప్రత్యేక పొదుపు సంఘం

ఆర్థికశాఖలోని కంపెనీ నిర్వహణకు సంబంధించిన అనుబంధ శాఖలో ప్రత్యేక పొదుపు పరిశీలక సంఘాన్ని నియమించినట్లు తెలిసింది. ఈశాఖలో మరింత పొదుపుచేసే అవకాశాలను వీరు పరిశీలిస్తారు. ఈసంఘానికి శ్రీ డి. యల్. మజుందార్ అధ్యక్షులు. కొన్ని నెలలక్రితమే ఈశాఖలో భారీ ఎత్తున పొదుపు కార్యక్రమాన్ని అమలుపరచారని ఈశాఖ ప్రతినిధి ఒకరు తెలిపారు. ఈశాఖ ఆధ్వర్యంలోని ఐదింటిలోను ఒకభాగాన్ని రద్దు చేశారు; కొన్ని ఉన్నత పదవులలో ఉద్యోగులను నియమించలేదు; ఈశాఖ మొత్తం ఖర్చుకు ఒక పరిమితి ఏర్పాటుచేశారు. అనుమతించిన ఏకు పదవులను పూర్తిచేయడంలో ఎంతో జాగ్రత్తగా వ్యవహరించారు. ఈశాఖకు సంబంధించిన అనేక కార్యక్రమంలో ఉన్నా అనేక కార్యకలాపాలను తగ్గించి వేశారు. ఇందువల్ల ఈశాఖ చాలవరకు వ్యయం పొదుపుగానే ఉంటే అవకాశం ఉంది. ఈపొదుపు విషయంలో తీసికొన్న మరోచర్య ఏమంటే, అవసర ఉద్యోగుల జాబితాలో ఉన్నవారిని కూడా నియమించక పోవడం. ఈఉద్యోగుల అవసరం లేకుండా, ప్రస్తుతం ఉన్న వారితోనే సాధ్యమైనంతవరకూ పనులు ముగిస్తారు. అంతేకా అవసరమైతే ఆ ఖాళీలను పూర్తిచేస్తారు.

### లఘుపరిశ్రమల అభివృద్ధి పథకాల సత్వర ఆచరణకు చర్యలు

న్యూఢిల్లీ, జూలై 2: చిన్న పరిశ్రమల అభివృద్ధికిగాను తయారైన పథకాలు శీఘ్రంగా అమలుజరగటంలో తగుచర్యలు తీసుకునేందుకు, రాష్ట్ర ప్రభుత్వ అధికారులు యీ 6వ యిక్కడ సమావేశమై చర్చలు జరుపుతారు.

కేంద్ర వాణిజ్య, పారిశ్రామికశాఖ అధ్వర్యంలో జరుగుతున్న యీ సమావేశానికి 14 రాష్ట్రాల్లోని పరిశ్రమల డైరెక్టర్లు హాజరవుతారు.

చిన్న పారిశ్రామికులకు ధనసహాయం చేసేఅంశాన్నిగూడా వీరు పరిశీలిస్తారు.

### కొత్తరాజకీయ పక్షాలు

#### ఎన్నికలు ప్రతిబంధకం

—లోహియా

న్యూఢిల్లీ, జూలై 3: నూతన రాజకీయపక్షాలకు ఎన్నికలు ప్రతిబంధకమని, ఎన్నికలచట్టాలు, పద్ధతులపై దివాక్ చంద్ సమాచారకేంద్రం ఏర్పాటు చేసిన సమావేశంలో ప్రసంగిస్తూ, సోషలిస్టుపార్టీ నాయకుడు డాక్టర్ రామమనోహర్ లోహియా తెలియజేశారు.

ఎన్నికలసంఘం జారీచేసిన ప్రజాప్రాతినిధ్యచట్టం, తదితర ఉత్తరువులు, రాజ్యాంగానికి విరుద్ధమనీ, ముఖ్యంగా ప్రజల సమానత్వం, రక్షణకు సంబంధించిన 14, 326 నిబంధనలు, ఆ చట్టం ప్రకారమే రాజ్యాంగాన్ని త్రోసిరాజంటున్నాయనీ డాక్టర్ లోహియా అన్నారు.

"ప్రభుత్వం గుర్తించిన రాజకీయ పక్షాలకు శాశ్వతంగా ఒకేవిధమైన ఎన్నికల చిహ్నాలను కేటాయించడంవల్ల కొత్త పక్షాలకంటె వాటికి విజయావకాశాలు అధికంగా లభించాయి. ఈ పద్ధతి ప్రకారం, కొత్త పక్షాలవారు ఎన్నికల చిహ్నాలను ప్రచారం చేసుకునేందుకు 15 రోజుల వ్యవధి మాత్రమే ఉంటుంది.

ఎన్నికల సంఘంచే రాజకీయ పక్షాల గుర్తింపు విధానం సరికాదు.

1951–52 ఎన్నికల్లో పడ్డ వోట్లలో నూటికి 3 వోట్లు చొప్పున లభించాలన్న నిబంధన రద్దుకావాలి.

"పార్టీ మంచి చెడ్డలను చూడకుండా ఎన్నడో జరిగిన ఎన్నికను, ఈ గుర్తింపుకు ముడిపెట్టటం అసంగతం.

"ఏ రాజకీయపక్షం అయినప్పటికీ, దేశవ్యాప్తంగా తన శాఖలను ఏర్పాటు చేసుకొని, ఒక నిర్దిష్ట కార్యక్రమాన్ని అనుసరిస్తూ, లెక్కలను సక్రమంగా నిర్వహించగలిగితే, దానికి జాతీయ ప్రతిపత్తి తప్పనిసరిగా యివ్వాలి" అని డాక్టర్ రామమనోహర లోహియా కోరారు.

### లక్షదీవుల పరిపాలన

#### సలహాసంఘంనియామకం

న్యూఢిల్లీ జూలై 3: లక్షదీవులు, మినికాయ్, అమినిదీవుల పరిపాలనా నిర్వహణ కలాపాలవిషయంలో సలహాలివ్వడానికి ఒక సలహాసంఘం ఏర్పాటయింది.

"ఈసలహాసంఘం 58 మార్చి 31 వరకూ పనిచేస్తుంది. ఇందులో వివిధ వరాలకు చెందిన ఐదుగురు సభ్యులున్నారు. వారిపేర్లు శ్రీ పి.మహమ్మద్ (అమెనీ), శ్రీ కె. నల్లకోయా (అండ్రోత్) శ్రీ పి. ఏ. పూకోయా (కాల్పేనీ), శ్రీ సయ్యద్ మహమ్మద్ కోయతంగల్ (కవరాతీ), శ్రీ యల్.జి. ఇబ్రహీం మనికాఫెన్ (మినికాయ్).

ఈదీవుల పరిపాలకుడు ఈ సలహా సంఘంలో సభ్యులు. ఈ సంఘం సాలీనా రెండుసార్లు సమావేశమౌతుంది. పరిపాలకుడు ఈ సమావేశాలకు అధ్యక్షత వహిస్తారు.

### జానపద విద్యా సంస్థలు

#### డా॥ శ్రీ మాలీ హితవు

న్యూఢిల్లీ, జూలై 3 జానపద విద్యాసంస్థలు, పాతమార్గాలను గాక, కొత్త మార్గాలను అనుసరించి పని చేయవలసివున్నదని కేంద్రవిద్యాశాఖ స్టేట్ మంత్రి డా॥ కే. ఎల్. శ్రీ మాలి జాతీయ గ్రామోన్నత విద్యాసంఘ సమావేశాన్ని ప్రారంభిస్తూ అన్నారు.

దేశంలో ఇటువంటి జానపద విద్యా వ్యవస్థలు అక్కడా అక్కడా ఒక 10 దాకావున్నాయి. ఈ వ్యవస్థల అభివృద్ధిని గూర్చి ఈ సంఘంవారు ఆలోచనలు చేస్తున్నారు. ఈ సమావేశాన్ని ప్రారంభిస్తూ ఈ విద్యాసంస్థలు పాత పద్ధతుల అనుసరిస్తే, కేంద్రం వీటికి సహాయం చెయ్యడం అనవసరం" అన్నారు.

### నీరు వడగట్టడానికి కొత్త పద్ధతి

న్యూఢిల్లీ, జూలై 3: పూనాలోని జాతీయ రసాయనిక పరిశోధకశాల వారు, గొట్టపు బావుల నిర్మాణంలో నీరు వడగట్టడానికి కొత్తరకం ఫిల్టర్లు కనిపెట్టారు. వీటిని పోరస్ రిజిడ్ ఫిల్టర్లు అంటారు.



రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కె. రఘురామయ్యకు దుగ్గిరాల పంచాయతీబోర్డు స్వాగతపత్రం సమర్పించింది. శ్రీ రఘురామయ్యకు ఇరువైపులా వున్నవారిలో శ్రీ నిమ్మగడ్డ జగయ్య, వెనిగళ్ళ సత్యనారాయణ, మంతెన వెంకటరాజు, నిమ్మగడ్డ నాగేశ్వరరావు, బొచిన సుబ్బారావు వున్నారు.



రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్యకు 2వ తేదీన మద్రాసులో సన్మానం జరిగింది. ఎడమనుండి కుడికి శ్రీమతి మేరీక్లబ్ వాలాజస్, కె. యస్. శ్రీనివాసన్, కె. రఘురామయ్య, పి. బ్రహ్మయ్య వున్నారు.



ఆంధ్రప్రదేశ్ ఇంజనీరింగ్ సలహాదారుడు శ్రీ యల్. వెంకటకృష్ణఅయ్యర్ కేంద్ర నీటిపారుదల ఉపమంత్రికి సోమశిలడాము నిర్మాణ స్థలాన్ని చూపిస్తున్నారు. రాష్ట్ర నీటిపారుదల మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు, శ్రీ కె. యల్. రావు (వంకలో టోపీవున్నవారు) శ్రీ రామచంద్రారెడ్డి కూడా వున్నారు.



సోమశిలవద్ద శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డి అధ్యక్షతను జరిగిన సభలో కేంద్ర నీటిపారుదల ఉపమంత్రి శ్రీ హైసుఖ్ లాల్ హాతీ మాట్లాడుతున్నారు. శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి వారి ఉపన్యాసాన్ని తెలుగులో చెప్పుతున్నారు.

### ఖనిజ పరిశ్రమ లెక్కల సేకరణ

#### సలహా సంఘం సూచన

న్యూఢిల్లీ, జూలై 3: ఈ మధ్య సిమ్లాలో సమావేశమైన ఖనిజ పరిశ్రమ సలహా సంఘం, వివిధ రాష్ట్రాలలో, ఖనిజ పరిశ్రమ గురించిన లెక్కల సేకరణకు ఇంకా గట్టిపద్ధతులు అవలంబించాలని, దీనికిగాను ఒక కార్యవర్గ సంఘం నెలకొల్పాలని సూచించింది.

ఈ సంఘం రాష్ట్ర ప్రభుత్వాలతో సంప్రతించి. భారతీయ గనులశాఖ అవసరాలకు అనుగుణంగా ఉండేటట్టు ఇంకా ప్రయోజనకరమైన పద్ధతులను ప్రవేశ పెడుతుంది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయం మీద పరిశ్రమలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చినందువల్ల, ఈ లెక్కల సేకరణ ప్రాముఖ్యం హెచ్చింది.

ఇంతవరకూ వివిధ రాష్ట్రాలు ఈ విషయంలో వేరు వేరు పద్ధతుల నవలంబిస్తున్నాయి. ఇపుడు అన్ని రాష్ట్రాలలో నూఒకేమాదిరి విధానాలు ఏర్పాటు చేస్తారు.

### విశ్వ విద్యాలయ ఆర్థిక సహాయ సంఘం సభ్యుడుగా డాక్టర్ కృష్ణన్ నియామకం

న్యూఢిల్లీ, జూలై 3: ఢిల్లీ జాతీయ భౌతిక విజ్ఞానశాస్త్ర పరిశోధనాలయం డైరెక్టరు డాక్టర్ కె. యస్. కృష్ణన్‌ను డాక్టర్ యం. యస్. థాకర్ స్థానే విశ్వ విద్యాలయ ఆర్థిక సహాయ సంఘ సభ్యునిగా నియమించినట్లు కేంద్ర విద్యాశాఖ ప్రకటించింది.

### భారత ఇంజనీర్లకు నేపాల్‌రాజు సత్కారం

ఖాట్మండు, జూలై 3: త్రిభువన రాజపథాన్ని నిర్మించిన పదమూడు మంది భారతీయ సైనిక ఇంజనీర్లను, ఒక నేపాలీ సైనిక ఇంజనీరును నిన్న రాత్రి నేపాల్ రాజు మహేంద్ర సత్కరించారు. ఈ సన్మానాన్ని నేపాల్ రహదారుల శాఖామంత్రి శ్రీ పశుపతినాథ్ ఘోష్ ఏర్పాటు చేశారు. కిర్కీలోని భారతీయ సైనిక ఇంజనీర్ల కళాశాలకు. వెండితో తయారుచేసిన కళాశాల నమూనాను కూడా బహూకరించారు. సత్కారం పొందిన భారత ఇంజనీర్లలో మొదటివారు కర్నల్ వత్సస్వామి. ఈయనకు త్రిశక్తిపట్టా (మూడవతరగతి) ఇచ్చారు. తక్కిన వారికి గోర్ఖా నాలవతరగతి దక్షిణ బాహు, త్రిశక్తిపట్టా బిరుదులను బహూకరించారు.

### రైలు ప్రయాణాలు

#### నెలరోజులపాటు చౌక రిటర్న్ టిక్కెట్లు

న్యూఢిల్లీ, జూలై 3: రైళ్ళల్లో తిరుగుప్రయాణాలకు జూలై 15 నుంచి సెప్టెంబరు 15 వరకూ టిక్కెట్లు ఖర్చులు చవక చేస్తారు. అంటే ఒక చోటునుంచి మరొక చోటుకి వెళ్ళేందుకయే ఖర్చులో మళ్లీ తిరుగు ప్రయాణానికి, సగంసొమ్ము చెల్లించుకుంటే చాలు. ఇవి మొదటి రెండు, మూడు, తరగతుల ప్రయాణీకులకు వర్తిస్తాయి.

ఈ తిరుగు ప్రయాణం టిక్కెట్లు 300 మైళ్ళపైగా ప్రయాణంచేసేవారికే యిస్తారు. ప్రయాణీకులు తిరుగు ప్రయాణం ఏ స్టేషన్‌నుంచి మొదలెడతారో అక్కడ తమ వద్దనున్న సగం టిక్కెట్టుమీద ఆ రోజు తేదీ వేయించుకోవాలి.

301 మైళ్ళనుంచి 500 మైళ్ళ దాకా ప్రయాణానికి యీ టిక్కెట్లు 20 రోజులలోగా వాడుకోవాలి. 501 మైళ్ళనుంచి 750 మైళ్ళ దాకా చేసే ప్రయాణానికి యీ టిక్కెట్ల గడువు 25 రోజులు. 751 మైళ్ళపై ప్రయాణానికి 30 రోజుల తరువాత యీ టిక్కెట్లు పనికిరావు.

మొత్తంమీద సెప్టెంబరు 30 తరువాత యీ టిక్కెట్లు చెల్లవు. అంటే ఉదాహరణకి 750 మైళ్ళపై దూరం ప్రయాణానికి సెప్టెంబరు 15వ తేదీన కొన్న తిరుగు ప్రయాణం టిక్కెట్టు సెప్టెంబరు 30 వ తేదీ వరకే పనికొస్తుందన్నమాట.

### పంజాబులో పాఠశాలలు

#### వశం చేసుకోవాలని ప్రభుత్వ నిర్ణయం

చండీఘర్, జూలై 3: రాష్ట్రంలో స్థానికసంస్థలు నిర్వహిస్తున్న పాఠశాలలన్నింటినీ అక్టోబరు 1 నుంచీ స్వాధీన పర్చుకోవాలని పంజాబు ప్రభుత్వం నిశ్చయించింది.

విద్యాశాఖ ఉపమంత్రి శ్రీ యాష్ పాల్ యీ సంగతి యివాళ పత్రికా విలేఖరుల సమావేశంలో వెల్లడిస్తూ కేంద్ర విద్యామంత్రి మౌలానా ఆజాద్ కొంతకాలంక్రితం స్థానికసంస్థల ఉపాధ్యాయులకు యిచ్చిన హామీని అనుసరించి, రాష్ట్ర ప్రభుత్వం యీ చర్య తీసుకొంటున్నదని చెప్పారు.

స్థానికసంస్థలు నిర్వహిస్తున్న ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు, రాష్ట్రంలో మొత్తం 10 వేలదాకా ఉన్నాయి.

### రోడ్డు రవాణాకు నిర్బంధాలు

#### తీసివేయాలని రాజ్‌బహదూర్ సూచన

మధుర, జూలై 2: ద్వితీయ ప్రణాళికా కాలంలో సరుకుల రవాణా వత్తిడిని తగ్గించేందుకుగాను రోడ్ల మీద ట్రక్కులు, లారీలు లాంటి వాహనాల నడకకు అంత రాష్ట్రీయ నిర్బంధాలు వుండకూడదని కేంద్ర రైల్వే, తపాలా మంత్రి శ్రీ రాజ్ బహదూర్ చెప్పారు.

రైల్వేలు ద్వితీయ ప్రణాళికా కాలంలో 60 వంతుల సరుకును మాత్రం రవాణా చేయగలవు. మిగిలిన దానికి రోడ్లమీద ఆధారపడవలసివుంది. రోడ్ రవాణాపై వివిధరాష్ట్రాలు విధిస్తున్న నిర్బంధాలవల్ల సరకుల శీఘ్రరవాణాకు ఇబ్బందిగావుంది. ఈ నిర్బంధాలను తొలగించటం తప్ప మార్గాంతరం లేదని శ్రీ రాజ్ బహదూర్ ఇక్కడ పత్రికా ప్రతినిధులతో చెప్పారు.

### దేశంలో విద్యా ప్రణాళికల అమలు

#### ప్రణాళికా ఉపసంఘంచే పరిశీలన

న్యూఢిల్లీ, జూలై 3: ప్రణాళికా రచనాసంఘం ఏర్పాటుచేసిన విద్యా ఉపసంఘం ద్వితీయ సమావేశం జూలై 15, 16 తేదీలలో పూనాలో జరుగుతుంది.

ఉపసంఘం మొదటి ప్రణాళికలో సాధించిన విద్యాభివృద్ధిగూర్చి విమర్శించి ద్వితీయప్రణాళిక మొదటి సంవత్సరం కార్యక్రమాలను పరిశీలిస్తుంది. ద్వితీయ ప్రణాళికా కాలంలో ప్రాథమిక, ఆధార, ఉన్నత, విశ్వవిద్యాలయ విద్యావిధానముల పరిశీలన కూడా జరుగుతుంది.

ద్వితీయ ప్రణాళికా కాలంలో విద్యాకార్యక్రమాలు గూర్చి విమర్శించి అభివృద్ధిని అంచనా వేసేనిమిత్తం రచనా సంఘం ఈ ఉపసంఘాన్ని నియమించింది. దేశంలో విద్యా ప్రణాళికల విషయంలో ఈ సంఘం రచనాసంఘానికి సలహా ఇస్తూ వుంటుంది.

డాక్టరు జె. సి. ఘోష్ అధ్యక్షుడుగావున్న ఈసంఘంలో 26 గురు సభ్యులున్నారు.

జమ్ము జులై 2: నిన్న సాయంత్రం ఇక్కడ కేంద్ర జైలుదగ్గర పోలీసులకు ఒక నాటుబాంబు దొరికింది. దానిని పోలీసు స్టేషనుకు తీసుకొనివెళ్లి పరిశీలించగా ఒక వత్తితో ప్రేల్చటానికి సిద్ధంగావుంది. ఇటీవల నగరంలో శ్రీనగర్‌లో వరసగా బాంబులు ప్రేలిన సంగతి తెలిసిందే.

### లోహాల వాయిదా వ్యాపారం

#### నిలపాలని బొంబాయి మండలి నిర్ణయం

బొంబాయి, జూలై 2: దిగుమతుల విషయంలో ప్రభుత్వం కఠినంగా వ్యవహరిస్తున్నందువల్ల ఇనుము మినహాయితర లోహాల వాయిదా వ్యాపారాన్ని కాలపరిమితి లేకుండా నిలిపివేయాలని బొంబాయి లోహవ్యాపార మండలి నిర్ణయించింది.

ఈ లోహాలు ఎక్కువగా విదేశాల నుంచి దిగుమతి అవుతున్న కారణంగా యీ వ్యాపారాన్ని నిలిపివేయవలసి వచ్చిందని మండలి ప్రతినిధి తెలియజేశారు.

### రాగి కడ్డీలు, తీగె ఎగుమతుల నిషేధం

#### విద్యుచ్ఛక్తి అవసరాల దృష్ట్యా

బొంబాయి, జూలై 2: విద్యుచ్ఛక్తి పనులకు అవసరమైన రాగిపలకలు, కడ్డీలు, గొట్టాలు, తీగ తదితర వస్తుసామాగ్రిని ఎగుమతి చేయరాదని భారత ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది.

రాగి, ఇత్తడి, అల్యూమినియం, వస్తువుల ఎగుమతిని క్రమబద్ధం చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఈ జూలై నుంచి డిశెంబర్ వరకు, మొత్తం 3250 టన్నులకు మించకుండా, రాగిరేకులు చుట్లు, ముక్కలు తదితర వస్తువులను బొంబాయి రేవునుంచి స్వేచ్ఛగా ఎగుమతి చేయటానికి ప్రభుత్వం అనుమతిస్తుంది.

## గంటల పంచాంగం

శ్రీ హేవిలంబి సం॥ ఆషాఢ శు॥ నవమి 1957 సం॥ జూలై 5 శుక్రవారం శు॥ నవమి రా 8-27 చిత్ర 24-32 వర్జ్యం 8-59 ల 10-32 వ.

శు॥ దశమి జూలై 6 శనివారం శు॥ దశమి రా 2-34 స్వాతి 24-20 వర్జ్యం 6-6 ల 7-41 వ.

ఆంధ్రపత్రిక

ఒకటే యని యొనరించిన
పరశర ఆప్రియమును తన మనంబున దగు దా
గొరులకు వనిసేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్
(మహాభారతము)

హేవిలంబి సం॥ ఆషాఢ శు॥ నవమి
శుక్రవారం

## రాష్ట్ర ఆర్థికస్థితి

క్రిందటి నాలుగు సంవత్సరాల్లోనూ ఆంధ్ర రాష్ట్ర ఆదాయం పన్నెండు కోట్ల నలభై లక్షల రూపాయలు పెరిగింది. ఖర్చులు కూడా, అదే ప్రమాణంలో కాకపోయినా, పెరిగిపోయినవి. అయితే ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు చెప్పినట్లు పరిస్థితులు అంత నిరుత్సాహకరంగా లేవు. 1954-55 వ సంవత్సరంలో ఆంధ్ర రాష్ట్ర ఆదాయం ఖర్చులకంటే అయిదు కోట్ల రూపాయలు తక్కువగా వుంది. మరునటి సంవత్సరం ఈ లోటు పదకొండు లక్షల రూపాయలు పెరిగినా 1956-57 వ సంవత్సరంలో ఈ లోటు సగానికిపైగా తగ్గింది. 1956-57 వ సంవత్సరంలో ఎంత లోటు వున్నదో 1957-58 ఆర్థిక సంవత్సరంలోనూ అంతే లోటు వున్నట్లు కన్పిస్తున్నది. క్రిందటి సంవత్సరం లోటును ఏదో విధంగా భర్తీ చేసి వుంటే 1957-58 సంవత్సరంలో ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించినంత వరకు, రివెన్యూ ఖాతాలో, తరుగు ఉండేదికాదు. ఆవిధంగా ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు 1957-58 ఆయవ్యయ అంచెనాలను తయారు చేయడంలో చాలా జాగ్రత్తగా వ్యవహరించారని చెప్పవచ్చును. కొత్త పన్నులను ప్రస్తుతం విధించడం లేదని ప్రకటించినందుకు గాక, లోటును క్రిందటి సంవత్సరం లోటుకు మించకుండా ఆయవ్యయ అంచెనాలను తయారుచేసినందుకు ఆర్థిక మంత్రిని అభినందింపవలసియున్నది.

క్రిందటి నాలుగు సంవత్సరాల్లో ఆంధ్రరాష్ట్రంలోటు క్రమంగా తగ్గుతూరాగా తెలంగాణా ప్రాంతం లోటు క్రమంగా పెరుగుతూవచ్చింది. 1954-55 ఆర్థిక సంవత్సరంలో ఆంధ్ర రాష్ట్రం లోటు 5 కోట్ల 18 లక్షల రూపాయలు. ఆ సంవత్సరం తెలంగాణా ప్రాంతం లోటు 51 లక్షల రూపాయలు మాత్రమే. 1957-58 ఆర్థిక సంవత్సరంలో ఆంధ్రరాష్ట్రం లోటు 2 కోట్ల 43 లక్షల రూపాయలు, తెలంగాణా ప్రాంతం లోటు 3 కోట్ల ఐదు లక్షల రూపాయలు ఉంటుందని అంచనావేశారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడినతరువాత, ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల ఆదాయాన్ని ఖర్చును విడివిడిగా విచారించి ప్రయోజనం లేదు. మొత్తం మీద 1957-58 ఆర్థికసంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ఖర్చులు ఆదాయంమించి అయిదున్నర కోట్ల రూపాయలున్నవి. ఆ లోటును ఏదోవిధంగా భర్తీ చేయక తప్పదు. ఋణసేకరణ ద్వారా ఈ తరుగును తగ్గించివేయడానికి అవకాశం లేదు. రాష్ట్రప్రభుత్వాలు అప్పులకు బయల్దేరడం వాంఛనీయం గాదని రిజర్వుబ్యాంకు స్పష్టం చేసినది. ఖర్చులు తగ్గించుకొనిగాని, పన్నులు పెంచిగాని ఆర్థికమంత్రి ఈ లోటును భర్తీ చేయవలసివుంటుంది. గ్రామోద్యోగులకు, ప్రాథమిక ఉపాధ్యాయులకు ఇచ్చిన హామీలను, చేసిన వాగ్దానాలను చెల్లించే పక్షంలో ఖర్చులు ఇంకా పెరగకతప్పదు. పన్నుల ద్వారానే ఎక్కువ ఆర్జించి ఈ లోటును భర్తీ చేయవలసి వుంటుంది. ఈ విషయం ఆర్థిక మంత్రి ఆలోచనలో వున్నట్లే కన్పిస్తున్నది.

ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు రాష్ట్ర ఆర్థికపరిస్థితిని వివరించడంలో ప్రజలకు, ప్రజాప్రతినిధులకు ఏ విషయాన్ని దాచకుండా యథార్థ విషయాలను చెప్పివేశారు. అప్పుచేయవలసిన అవసరంగాని, చేసేందుకు అవకాశంగాని లేనందువల్ల ఉన్నవిషయాలను యథాతథంగా వివరించడంవల్ల నష్టం లేదని ఆర్థికమంత్రి భావించి యుండవచ్చును. పరిస్థితి ఎంత ఆందోళనకరంగా వుందో, ప్రజలు, ప్రజాప్రతినిధులు గ్రహించితే, తాము ముందు తీసుకోబోయే చర్యలకు అంత ప్రతిఘటన వుండదని కూడా ఆర్థిక మంత్రి ఆశించియుండవచ్చును. వెనకచేసిన అప్పుల మీద చెల్లించే వడ్డీ, ఉద్యోగులకు ఇచ్చే పెన్షన్ల క్రిందనే ఏటా ఏడున్నరకోట్ల రూపాయలు ఖర్చుచేయవలసి వుంటున్నదని శ్రీ గోపాలరెడ్డిగారు వెల్లడించారు. ఈ 'వారసత్వం' లేకపోతే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ జరుగుబాటుస్థితి, మొత్తంమీద ఆర్థికస్థితి చాలా తృప్తికరంగా వుండేదని ఆర్థిక మంత్రి అభిప్రాయం. యథార్థమే. కాని ఇదివరలో చేసిన ఋణాలు సద్వినియోగమై, ప్రతిఫలం ఇచ్చే ప్రాజెక్టులపై ఖర్చు అయివుంటే వడ్డీ దబ్బే గాక, అసలును చెల్లించడానికి కూడా కొంత డబ్బు లభించియుండవలసినది. క్రిందటి నాలుగైదు సంవత్సరాల్లోనే ప్రభుత్వ ఋణాలపై ఎక్కువవడ్డీ ఇవ్వడం జరిగిందిగాని, అంతకు పూర్వం వడ్డీరేటు తక్కువగానే వుంటూ వచ్చింది.

ఈ పరిస్థితులను గుర్తింపవలసిందే గాని, వాటినిగురించే విచారించి ప్రయోజనం లేదు. రివెన్యూ ఖాతానే గాక, పెట్టుబడి ఖాతాను కూడా లోటు చాలా ఎక్కువగానే వుంటున్నది. ద్వితీయ ప్రణాళిక అమలుకు 175 కోట్ల రూపాయలు కావలసి వుంటుందని అంచెనా. ఇందుకుగాను షుమారు 90 కోట్ల రూపాయలు మాత్రమే లభించనున్నట్లు ఆర్థిక మంత్రి వెల్లడించారు.

ఆంధ్రరాష్ట్రానికి సంబంధించినంతవరకు ద్వితీయ ప్రణాళికను చాలావరకు కుదించివేయడం జరిగింది. ఇంకా తగ్గించడం గాని, కొన్ని కార్యక్రమాలను విరమించడం గాని సాధ్యం గాదు. ఆర్థికమంత్రి చెప్పినట్లు కేంద్రప్రభుత్వం ఇప్పటికంటే ఎక్కువ సహాయాన్ని చేయవలసి వుంటుంది. రాష్ట్రంలో కూడా ఎక్కువ డబ్బును సేకరించవలసివుంటుంది. రాష్ట్రంలో డబ్బును సేకరించలేకపోవడంవల్ల కేంద్రంనుంచి రావలసిన సహాయం కూడా రావడం లేదు. రాష్ట్ర ఆర్థికస్థితి విపత్కరంగా లేకపోయినా, కొంత ఆందోళనకరంగా వుందని అంగీకరించక తప్పదు. రాష్ట్రంలోని వర్తక, పారిశ్రామిక ప్రముఖులను, అర్థశాస్త్ర ప్రవీణులను సమావేశపరచి ఈ పరిస్థితులను సాకల్యంగా పరిశీలించి తరణోపాయాలను అన్వేషించడం అత్యవసరంగా కన్పిస్తున్నది.

## పాఠశాలలు తిరిగి మూసివేత

### బందరులో కలెక్టరు ఉత్తర్వు

(ఆంధ్రపత్రిక ప్రతినిధులనుండి)

మద్రాసు, జూలై 3: బందరులో పాఠశాలల నన్నిటినీ ఈరోజు తెరచారు. కాని శీతజ్వరం ఉధృతంగా ఉండడంవల్ల ఈ నెల పదో తేదీవరకూ పాఠశాలల నన్నిటినీ మూసివేయవలసిందని కృష్ణా జిల్లా కలెక్టరు ఉత్తర్వు చేశారు. అందువల్ల తెరచిన పాఠశాలలను తిరిగి మూసివేశారు. మొదట్లో విద్యాలయాలను ఈ నెల 8 వరకూ తెరవ వద్దని ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. కాని 8 వ తేదీ నే తెరవవచ్చునని తిరిగి ఉత్తర్వుచేశారు. అందువల్ల ఈరోజు పాఠశాలలను తెరచారు. ఇక్కడ శీతజ్వరం ఉధృతంగానే ఉన్నదని పురపాలకసంఘ ఆరోగ్య శాఖాధికారి, జిల్లాకలెక్టరు తెలిపారు.

### భద్రాచలంలో శిశువు మరణం

భద్రాచలంలోను, పరిసర ప్రాంతాలలోను రెండు వేలమందికి ఈ వ్యాధి సోకింది. ఈ జ్వరంవల్ల మూడేండ్ల శిశువు మరణించింది. ఈ ప్రాంతంలోని పాఠశాలలన్నిటినీ మూసివేశారు.

### కొత్తగూడెంలో 4 వేల మందికి జ్వరం

కొత్తగూడెం, రామవరం నగరాలలో గత 36 గంటలలోనూ సుమారు ఐదువేల మందికి ఈ జ్వరం సోకింది. వీరిలో ఇంతవరకూ ఈ వ్యాధి సోకిన వారి సంఖ్య నాలుగువేలు అయింది. ఇప్పటివరకూ గనుల ప్రాంతంలోని ఆసుపత్రిలో 2500 మంది, ఇతర వైద్యులవద్ద మరో 1500 మంది చికిత్స పొందారని అధికారులు అంటున్నారు. రెండురోజుల్లక్రితం గని ప్రాంతం ఆసుపత్రినుండి 170 మందిని విడుదల చేశారు. ఈ విషయాన్ని సింగరేణి గనుల జనరల్ మేనేజరు శ్రీ కె. నర్సుండ్కర్ తెలిపారు. రోగులకు ఏర్పాటుచేసిన ప్రత్యేకవార్డులో తగినన్ని ఏర్పాట్లు లేవు కాని ఇక్కడ మంచాలను అధికం చేయమని ఉత్తర్వుచేశారు. సంచారక శకటాలలో రోగులకు ఉచితంగా మందులిచ్చే ఏర్పాటుచేశారనికూడా ఆయన తెలిపారు. ఈ ఆసుపత్రిలో రోగులను సరిగా చూడడంలేదని ఉద్యోగులు, ఉద్యోగేతరులు, ఒక స్థానికసంస్థ చేస్తున్న విమర్శను ఆయన ఖండించారు. ఆసుపత్రిలో కట్టుదిట్టమైన ఏర్పాట్లుఅన్నీ చేస్తున్నామనీ, ఒక్కరుకూడా ఆసుపత్రిలో మరణించలేదనీ తెలిపారు. గని కార్యాలయం, ఫలహారశాలలలో పనిచేసేవారికి జ్వరంరావడంవల్ల, కొద్దిమందిమాత్రమే పనులలోనికి వస్తున్నారు.

### ఆత్మకూరులో

ప్రభుత్వ ఆసుపత్రిలో మూడు వందలమంది జ్వరపీడితులకు చికిత్స చేశారు. వైద్యులవద్ద వేయిమందికి పైగా చికిత్సపొందారు. పాఠశాలలను పదిరోజులపాటు మూసివేయవలసిందని అధికారులకు తెలిపారు. నందికొట్కూరు, వెలుగోడు, ఇతరపరిసర గ్రామాలలో కూడా ఈ వ్యాధివల్ల ఎంతోమంది బాధపడుతున్నారు.

### ఎలమంచిలి

ఈ తాలూకాలోని పాఠశాలల నన్నిటినీ ఈనెల 7 వ తేదీవరకు మూసివేయమని ఉత్తర్వుచేశారు. తాలూకాలోగల వైద్యులను జిల్లాకలెక్టరు కలిసికొని, పరిస్థితినిగురించి పరిశీలించారు.

### సూర్యాపేట

ఇక్కడ సుమారు 700 మందికి జ్వరం సోకింది. పురపాలక సంఘాధ్యక్షుడు డాక్టర్ కె. శ్రీనివాసస్వామి అధ్యక్షతన జరిగిన వైద్య, పుర ప్రముఖుల సమావేశంలో శీతజ్వర నిరోధక సమితిని ఏర్పాటుచేశారు. ఈ సంఘంలో శాసన సభ్యులు బి. నరసింహారెడ్డి, ధర్మభిక్షం, డాక్టర్ శర్మ, డాక్టర్ సత్యనారాయణరావు, కోదాటి నారాయణరావు ప్రభృతులు ఉన్నారు. వీరు ప్రభుత్వానికి పరిస్థితిని వివరించి, తమ సహాయం చేయమనికోరారు. పురపాలక సంఘం వ్యాధి నిరోధనకు 500 రూపాయలను మంజూరు చేసి, తక్షణ చర్యగా రెండువందల రూపాయల మందులు తెప్పించి, ప్రభుత్వ ఆసుపత్రి అధికారి స్వాధీనం చేసినట్లు తెలిసింది. స్థానిక వైద్యులు ఉచితంగా చికిత్స చేస్తారని మాట ఇచ్చారు.

### రేపల్లె

ఇక్కడ శీతజ్వరం వేయిమందికిపైగా సోకినది. ఇంకా ఉధృతం ఏమీ లేదు.

# సౌమనస్యంతోనే భారత పాక్ సమస్యల పరిష్కారం సాధ్యం

## ప్రధాన మంత్రి విస్పష్ట ప్రకటన: హంగరీఅయినా, కాశ్మీరైనా భారతదేశవిధానంఒక్కటే

లండన్, జూలై 3: "నా చేతలకు ద్వంద్వప్రమాణాలు, నా మాటలకు రెండు నాల్కలు లేవు" అని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ నేడు ఇచ్చట విశదం చేశారు.

హంగరీ విషయంలో ఒక విధంగాను, కాశ్మీర్ విషయంలో ఇంకో విధంగాను, భారత దేశం మాట్లాడుతున్నదని, శ్రీ నెహ్రూ రెండు నాల్కలతో మాట్లాడుతున్నారనీ బ్రిటన్‌లో కొందరు సమితిలో చేస్తున్న విమర్శలను ప్రధాన మంత్రి ఖండించారు. "హంగరీ విషయంలో మేము ఆదినుంచీ ఒక్కమాటే చెబుతున్నాము. హంగరీలోంచి విదేశీ సైన్యాలు వెళ్ళిపోవాలి. హంగరీ వ్యవహారాలను హంగరీ ప్రజలే చూచుకోవాలి. ఈ మాటలే మేము మొదట చెప్పాము. తర్వాత అక్కడ పరిస్థితి ఘోరంగా మారిపోయింది. ఆ పరిస్థితి యుద్ధానికి దారితీసేదిగా సిద్ధం అయింది. ఆ పరిస్థితిని మరీ రెచ్చకొట్టాలని మాకు లేదు. అందువల్ల చెప్పవలసిన విషయాన్ని సౌమ్యంగా చెప్పాము" అన్నారు.

### భారత-పాకిస్తాన్ సమస్యలు

భారతదేశం పాకిస్తాన్‌ల సమస్యలను గూర్చి మాట్లాడుతూ, ఈ రెండు దేశాల క్షేమంకోసం, ఈ రెండు దేశాలమధ్య శాంతికోసం, తాము చెయ్యవలసిందంతా చేశామని శ్రీ నెహ్రూ ఈ సందర్భంలో విశదంచేశారు. కాని ఆ పరిస్థితులు బాగుపడే అదృష్టంమాత్రం కన్పించడంలేదు అన్నారు.

"కాశ్మీర్ సమస్య అనండి, పంజాబు నీటికాల్వల సమస్య అనండి, మరి ఇంకో సమస్య అనండి - ఇవి అన్నీ సౌమనస్యంతో తేల్చుకోవలసిన సమస్యలు తప్పుడు మార్గాలను అనుసరిస్తే, ఇవి తేలవు. కాశ్మీర్‌ను తీసుకు చూద్దాం; పాకిస్తాన్ సైన్యాలు అక్కడ వున్నాయి. ఏ అధికారాన్ని బట్టి, ఏ హక్కును పురస్కరించుకొని అవి అక్కడ వున్నాయి? దురాక్రమణచేసి, అక్కడ నుంచి కదలకపోవడం తప్ప, వీటికి అక్కడ వున్న వునికి ఏమిటి? కాశ్మీర్ విషయంలో భారతదేశం ఒక వాగ్దానాన్ని ఇచ్చి దాన్ని పాలించకపోవడం అంటూ ఎప్పుడూ లేదు. ఇచ్చిన వాగ్దానాన్ని తిరస్కరించడం అంటూ అంతకన్నా లేదు. భద్రతాసంఘం ఈ వ్యవహారాన్ని గురించి ఒక్కటే తీర్మానం చేసింది. అందులో పాకిస్తాన్‌ను, కాశ్మీర్ నుంచి, దురాక్రమణ సైన్యాలను తొలగించవలసిందిగా కోరింది. పాకిస్తాన్ అట్లా కనలేదు. ఇంకా అక్కడే వుంది. అక్కడి సైన్యాన్ని బలపరుచుకుంటోంది. అది భాగాద్వేష ప్రచారాన్ని, ప్రచ్ఛన్న యుద్ధాన్ని సాగిస్తోంది. కాశ్మీర్ వున్నదంటే, అది భారత దేశం న్యాయసిద్ధమైన, నిసర్గమైన, భాగం. ఈ విషయాన్ని అంతా గుర్తించాలి. ఇంకో విధంగా ఈ సమస్య పరిష్కారం అయ్యేందుకు వీలు లేదు. భారతదేశంలో ఒక్కపిట్టగూడా అందుకు అంగీకరించదు. భారతప్రజల ఈ వాంఛను కాదంటే, నా ప్రధానమంత్రిత్వం దమ్మిడీ ఖరీదు చెయ్యదు. భారతదేశం, పాకిస్తాన్‌లమధ్య అన్ని సమస్యలు పరిష్కారం కావలసిందే మాదేశాలు ఇరుగుపొరుగ్గా వున్నాయి. కాని ఒత్తిడులవల్ల, బెదిరింపులవల్ల, ఈ సమస్యలు పరిష్కారం కావు."

### ఇండియా లీగ్ సన్మానం

శ్రీ నెహ్రూకు ఇండియా లీగువారు సన్మానం ఏర్పాటుచేశారు. ఇది వెస్ట్‌మినిస్టర్ హాలులో జరిగింది. సభకు శ్రీ సోరెన్‌సెన్ అధ్యక్షత వహించారు. ఎరల్ అట్లీ శ్రీ నెహ్రూకు స్వాగతం చెప్పారు. "శ్రీ నెహ్రూకు ఈ దేశం ఎప్పుడు స్వాగతం ఇస్తుంది. ఆయన నాయకత్వంలో భారతదేశంలో జరుగుతున్న అఖండకృషిని నేను చూచాను. అది నా మనస్సును నచ్చింది." అన్నారు.

### శ్రీ నెహ్రూ అంటే బ్రిటన్‌లో ఉత్సాహం

సభకు బహు ఆసియాదేశాల రాయబారులు, ఘనా, ఎథియోపియా రాజకీయవేత్తలు, భారత రక్షణమంత్రి శ్రీ కృష్ణమీనన్, శ్రీమతి విజయలక్ష్మి పండిట్, బ్రిటన్‌లో వివిధప్రజాహిత సంస్థల ప్రతినిధులూ హాజరైనారు. సభకు వచ్చిన ప్రజలకు టిక్కట్లు పెట్టారు. ఆ టిక్కట్లు చాల్లేదు. ఈ వెస్ట్‌మినిస్టర్ హాలులో కి వేల మంది కన్నా ఎక్కువ పట్టరు. అందువల్ల టిక్కట్లకు బ్లాక్ మార్కెట్‌లో గూడా కొందరు అమ్మారు. బ్రిటన్‌లో శ్రీ నెహ్రూ అంటే కినుక ప్రబలిపోయిందని, ఇప్పుడు శ్రీ నెహ్రూను జనం ఆట్టే పాటించడంలేదని, టోరీ పత్రికలు, మితవాద పత్రికలు చేసిన ప్రచారం అంతా వట్టిదని దీనితో తేలిపోయింది.

### నెహ్రూ అంటే ప్రపంచంలో వున్న గౌరవం

శ్రీ సోరెన్‌సెన్ తన అధ్యక్ష వచనంలో ఈ సభను, బ్రిటన్, భారతదేశాల మధ్యవున్న స్నేహానుబంధానికి చిహ్నంగా వర్ణించారు. "కాలంతో పాటు ఈ స్నేహం గూడా పెరుగుతోంది. అట్లాఅని ఒకర్ని ఒకరు విమర్శించుకోకపోవడమూ, ఒకరితో ఒకరు నిర్మొగమాటంగా మాట్లాడుకోకపోవడమూ, అంటూ, లేదు. అందువల్లనే ఈ స్నేహం విశిష్ట మవుతోంది. శ్రీ నెహ్రూవున్నారంటే, ఆయన మాటను భారతదేశం శిరసావహిస్తుంది. అంతే కాదు, స్వాతంత్ర్యాన్ని ప్రేమించే ప్రతివాడూ, ఆయనమాటకు విలువ ఇస్తాడు. గౌరవిస్తాడు." అన్నారు.

### శ్రీ నెహ్రూ ప్రసంగం

ఆ అనంతరం శ్రీ నెహ్రూ మాట్లాడానికి లేచారు. సభఅంతా ఆయనతో లేచి నిలబడి, మర్యాదను ప్రకటించింది. శ్రీ నెహ్రూ తమ ప్రసంగంలో ప్రపంచ సమస్యలను పరిష్కరించుకునే పద్ధతిని గూర్చి, భారతదేశ విదేశాంగ విధానంలోవున్న అర్థాన్ని గూర్చి మాట్లాడారు. సైనిక కూటములవల్ల, సైనిక మనస్తత్వంవల్ల, ఈ ప్రపంచ సమస్యలు పరిష్కారం కావని ఆయన స్పష్టంగా చెప్పారు. "మా దేశంలో అందరు ఒక్క విషయంలో అతిస్పష్ట మనస్కులై వున్నారు. ఈ సైనిక కూటాలతో మనకు సంబంధాలు వద్దు అని వారు అంటున్నారు. అందుచేతనే మేము అంతర్జాతీయరంగంలో నిస్సంగ విధానాన్ని అనుసరిస్తున్నాము ఆ విధానాన్ని తాటస్థ్యం అనడం తప్పు అని ఆయన విశదం చేశారు.

"ప్రపంచంలో ఎన్నో సమస్యలు వున్నాయి. ఆ అన్నింటనీ ఆయుధబల ప్రయోగంచేత తేలుస్తామంటే చెల్లదు. శాంతిని శాంత పద్ధతుల ద్వారానే సాధించాలి. అదే దానికి మార్గం" అని చెప్పారు.

### రెండో పంచవర్ష ప్రణాళిక

భారతదేశం సమస్యలను గూర్చి మాట్లాడుతూ, ఇప్పుడు మాకువున్న పెద్ద సమస్య రెండో పంచవర్ష ప్రణాళికను గురించినది అని శ్రీ నెహ్రూ అన్నారు. దీన్ని మేము అమలు జరుపుకోవాలి. ఇందులో ఎన్నో కష్టాలు వున్నాయి. స్టెర్లింగు నిల్వలు తగ్గడం, విదేశీద్రవ్య లోపం కావడం, మొదలైన ఎన్నో గడ్డుకష్టాలను మేము దాటవలసి వుంది. ఈ కష్టాలను దాటితే కొత్త కష్టాలు వస్తాయి. అభివృద్ధికోసం పనులు ప్రారంభించినప్పుడు, ఇటువంటి కష్టాలు రాకమానవు; వాటిని ఎదుర్కొనకనూ తప్పదు. స్తబ్ధంగా వున్న జాతికి ఏ కష్టమూ వుండదు.

### పురోగామి దేశాలకే కష్టాలు వస్తాయి

"కష్టాలు అన్నవి, పురోగామి దక్షువులైన దేశాలకు మాత్రమే వస్తాయి. అందువల్ల ఈ కష్టాలను చూచి, మేము ఏదో అయిపోవడం అంటూ వుండదు. భారతదేశంలో సమాజం చైతన్యవంతమైంది. అది ముందుకు పోతోంది. ఇప్పుడు ఏవో కష్టాలు ఎదురైనాయి. వీటిని పరిష్కరించుకుంటాము. వీటిని పరిష్కరించుకుంటూ వుంటే, కొత్త సమస్యలు వస్తాయి. భారత ప్రజలు ముందుకు పోతున్నారు. ఒక్క భారత ప్రజలేకాదు. ఆసియాఅంతా ముందుకు పోతోంది. ఆఫ్రికా ముందుకుపోతోంది. శతాబ్దాల నిస్తబ్దతలోంచి ఈ దేశాలు బయటపడ్డాయి. ఇప్పుడు ఈ దేశాలు సవ్యమార్గాన్ని తొక్కవచ్చు; అపసవ్య మార్గాన్ని తొక్కవచ్చు; కాని వారి భాగధేయం, వారి ఆయత్తంలో వుంది. ఈమనో జాగరణాన్ని చూస్తేనే ఉత్సాహంగా వుంటుంది. బ్రహ్మాండంగా వుంటుంది. ఇందులో ఈమహా భాగధేయంలో, తన భూమిక ఏమిటో, దాన్ని భారతదేశం, నిర్వహిస్తోంది.

### 22 ఏండ్ల క్రిందటి సంగతి

"నేను 22 ఏండ్ల క్రిందట ఒకసారి, ఈ ఇండియా లీగు అధ్వర్యంలో మాట్లాడాను. ఆతర్వాత ఇప్పుడు మాట్లాడుతున్నాను. ఇప్పుడు భారతదేశం స్వతంత్రదేశం. ఇది మాపనిలో ఒక ఘట్టం మాత్రమే. ఇప్పుడు ఇంకో ఘట్టానికి బయలుదేరి పోతున్నాము. అందుచేతనే, ఇండియా లీగువంటి సంస్థలు వుండాలి; పనిచెయ్యాలి భారత ప్రజకు బ్రిటిష్ ప్రజలకు అనుబంధాలుగా ఇటువంటి సంస్థలు పనిచెయ్యాలి; వర్ధిల్లాలి.

### మధ్యప్రాచ్య వ్యవహారాలు

ఈ మధ్యప్రాచ్యంలో ఈమధ్య కొన్ని సంఘటనలు జరిగాయి. భారతదేశంలో అవి మహా సంభ్రమాన్ని కల్గించాయి. దీనివల్ల బ్రిటన్ భారత దేశాల మధ్య స్నేహానుబంధాలు గూడా కొంతవరకు దెబ్బతిన్నాయి. అయితే ఇప్పుడు ఆ అవస్థ గడిచిపోయింది. అది అట్లా గడిచిపోయింది అంటేనే, ఇందులో, ఈస్నేహానుబంధంలో, ఏదో విశేషం వున్నదని వ్యక్తం అవుతోంది. వట్టి మనోవాంఛ మాత్రమేగాక, అంతకన్నా అధికమైన అనుభవం ఏదో, మన హృదయాలను బిగిస్తోంది. ఇందువల్ల ఇంకో విషయం గూడా వ్యక్తమయింది. ఒకరు ఏదిచేస్తే దాన్ని అంతా అంగీకరిస్తారు. అనుకోవడం భ్రమ అని తేలింది. అది భ్రమ అని తెలుసుకున్నప్పుడు, మన అనుబంధాలు, మరింత దృఢం అవుతాయి.

### ఆత్మ విమర్శ

"భారతదేశాన్ని చాలామంది విమర్శిస్తున్నారు. ఆ విమర్శను మేము కాదనం; అసలు మమ్మల్ని మేమే విమర్శించుకుంటాము. ఈరకమైన ఆత్మవిమర్శ కాంగ్రెస్‌లో జరుగుతూనే వుంది. బయటవాళ్ళెవరన్నా వచ్చి, ఆ విమర్శలు వింటే, ఆశ్చర్యపోతారు. ఆ విమర్శవల్ల, కాంగ్రెస్ అడుక్కుపోతోంది అన్న భావాన్ని వారు పెంచుకున్నట్లయితే, పొరబడినవాళ్లవుతారు. ఎందుచేతనంటే, కాంగ్రెస్ అందువల్ల అడుక్కుపోవడంలేదు. ఆత్మవిమర్శను, మేము, ఐచ్ఛికంగా పెంపొందించుకుంటున్నాము.

### విమర్శను గౌరవిస్తాము

"అట్లాగే బయటవాళ్లు భారతదేశాన్ని విమర్శించినా, మేము ఏమీ అనుకోము. ఆ విమర్శను గౌరవిస్తాము. ఒక్కొక్కప్పుడు ఈ విమర్శ నెత్తితలలు బెయ్యడంగూడా వుంది. నిరాధారంగా విమర్శ చెయ్యడంగూడావుంది. ఒక్కొక్కప్పుడు, విమర్శ చేస్తున్న పద్ధతి మాకు బాధనుకూడా కల్గిస్తుంది. అయినా ఆ విమర్శచేసినందుకు మేము యేమీఅనుకోము. ఆ విమర్శలో మేము ఏకీభవిస్తామూ, సరే సరి; లేదా, దాన్ని అంగీకరించము అంతే.

"ఇతరుల సలహాలు తీసుకోవడం అన్నా మాకు బెరుకులేదు. బ్రిటన్‌లోని మా మిత్రులు, పూర్వం మాకు ఒకటే పనిగా సలహాలు ఇస్తూ వుండేవారు. ఆ సలహాలను అన్నింటిని ఆమోదించడం అంటూ పెట్టుకుంటే, మాకు ఇంకా స్వాతంత్ర్యం వచ్చివుండేది కాదు. అందువల్ల, ఇటువంటి విషయాలలో ఎవరి నిర్ణయంప్రకారం వారు పోతూవుండాలి. మేము అట్లాగే పోయినాము. మాకు మంచి అని తోచింది జరిపాము. మా కాళ్లమీద మేము నిలబడ్డాము. మేము చేసినపని తప్పు కావచ్చు. కాని ఏదేశమూ, తన మార్గం అంటూ ఒకటి ఏర్పాటుచేసుకోకపోతే, ఎప్పుడూ పైకిరాదు.

### అందరితోను స్నేహం కావాలి

"మేము అందరి స్నేహాన్ని కాంక్షిస్తున్నాము. అందరి సహాయాన్ని కోరుతున్నాము. కాని చివరికి తేలేది, మిగిలేది ఒక్కటే విషయం. ఎవరి బరువును వారే మొయ్యాలి. ఎవరి సంగతిని వారు ఆలోచించుకోవాలి. ఇతరులు ఇందులో సహాయంచేస్తే, చెయ్యవచ్చు. అటువంటి సహాయం చేసేవాళ్ళకు భారతదేశం ఎప్పుడూ కృతజ్ఞంగా వుంటుంది. కాని ఏదేశంగాని, బయటినుంచి అభివృద్ధిని కృత్రిమంగా తెచ్చిపెట్టుకుంటే, అది తెచ్చిపెట్టుకున్నట్లే వుంటుంది.

### ప్రపంచంలో వైవిధ్యం తప్పదు

ప్రపంచంలో ఏ దేశం అయినా, తన ఉనికినిబట్టే, చరిత్రనుబట్టి, పురాసంప్రదాయాలనుబట్టి, తన విధానాలను నిర్ణయించుకుంటూ వుంటుంది. ఒక సమస్య వున్నదనుకోండి. దాన్ని ఢిల్లీలో మేము ఒక విధంగా చూస్తాము. లండన్‌లో ఇంకోవిధంగా చూస్తారు. వాషింగ్టన్‌లో, మాస్కోలో, టోక్యోలో మరోమరో విధంగా చూస్తారు. ప్రతి ఒక్క ప్రాంతంనుంచి ప్రపంచ చిత్రం వేరువేరుగా కన్పిస్తుంది. ఈ వేరుపాటులు ఇట్లా వున్నా, ఇవి ఇట్లా వుండరాదని అంతా తాము ఒక్కరం అనుకున్నట్లే అనుకోవాలని అనడం, అందుకు ప్రయత్నించడం, నా మటుక్కు నాకు, అపూర్వంగా కన్పిస్తోంది.

### బలవంతం ప్రజాస్వామ్యం కాదు

"ఏకం విధమైన ఏకాంగిక వైఖరి ప్రజాస్వామ్యం కాదు. ప్రజాస్వామ్యానికి అది విరోధివస్తువు. ప్రజాస్వామ్యం అంటే, సహనం. ఇతరులను ఉపమంత్రణం ద్వారా తమ వైపుకు త్రిప్పుకోవడం ప్రజాస్వామ్యం అవుతుంది. బలవంతంచెయ్యడం ప్రజాస్వామ్యం కాదు. అందువల్లనే భారతదేశం నిస్సంగవైఖరి అంటూ పెట్టుకుంది.

"నేను మహావివేకినని అనడం లేదు. ఆసియాలో అన్ని దేశాల భావాలను చెప్పేవాణ్నిగూడా నేను కాదు. నేను భారతీయుల భావాలను మాత్రమే చెప్పగలవాణ్ని. అవే చెబుతున్నాను.

### ముక్త్యాల పుట్టకురుపు కేంద్రానికి రు 20 వేలు

విజయవాడ, జూలై 2: ముక్త్యాలలోని శ్రీ చంద్రమౌళీశ్వర పుట్టకురుపు కేంద్రంలో ఆయుర్వేద పద్ధతులపై చికిత్సా విధానాల పరిశోధనకు భారత ప్రభుత్వం రు 20 వేలు గ్రాంటుగా మంజూరు చేసింది. 1957-58 సంవత్సరానికి యీ గ్రాంటు వర్తిస్తుంది.

ఈ కేంద్రంలో ఒకసారి 10 మంది రోగులకు చికిత్స, విశ్రాంతి సౌకర్యాలున్నాయి.

# అమెరికా జరిపే అణ్వస్త్ర పరీక్షలు

## పరిశీలనకు విదేశాలకు అవకాశం

వాషింగ్టన్, జూలై 3: ఇకముందు అణ్వస్త్ర పరీక్షలను అమెరికా జరిపితే, ఈ పరీక్షలవల్ల కలిగే అణురజవ్యాప్తి పరిశీలనకు పరికరాలను పంపమని ప్రపంచంలోని ఏ రాజ్యాన్నయినా కోరగలమని పత్రికా ప్రతినిధుల సమావేశంలో అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ తెలిపారు.

అణురజదోషం ఎంతిమాత్రం లేని బాంబులను త్వరలోనే తయారు చేయగలమని అమెరికా శాస్త్రజ్ఞులు చెప్పే విషయాన్ని పైరీతిని ఇతర దేశాలు పరీక్ష చేయవచ్చునని ఆయన అన్నారు.

ఆయుధ విసర్జన ఒప్పందంలో ప్రథమ చర్యభాగంగా కొన్ని షరతులకు లోబడి పది మాసాలపాటు అణ్వస్త్ర పరీక్షలను విరమిస్తామని చెప్పిన విషయంలో తాము వెనుకంజ వేసేది ఏమీ లేదన్నారు. ఈ సూత్రానికి అమెరికా కట్టుబడి ఉందన్నారు. ఆయుధ విసర్జనపై సరియైన పరిశీలన, పరస్పరాల నిజాయితీ ఉండాలి. వీటితోపాటు అణుశక్తిగల పదార్థాలనుండి బాంబులను తయారు చేయరాదనే ఒప్పందాన్ని భవిష్యత్తులో ఒక తేదీలోగా రూపొందించుకోవాలని ఒప్పందంకూడా కుదరాలి.

ఆయుధ విసర్జన సమస్యపై అమెరికా విధానం హృదయపూర్వకమైనది కాదనే వాదనను ఆయన త్రోసిపుచ్చారు. ఆయుధ విసర్జన అన్నది అత్యంత క్లిష్ట సమస్య. అందువల్ల దీనిని త్రోసివేయాలని అమెరికా భావించడంలేదు. అనేక సంవత్సరాలుగా జరుపుతున్న పరిశీలనపై అమెరికా విధానం ఆధారపడివుంది అన్నారు. విదేశాలలోను, అమెరికాలోను అణుశక్తిని శాంతియుత కార్యక్రమాలకు వినియోగించేందుకు పరిశుద్ధిచేసి నీయురేనియం (యు. 235)ను అమెరికాసాధ్యమైనంత అధికంగా తయారు చేస్తోందన్నారు. ఈ విషయమై వివరాలను తమ భవనం నుండి ప్రకటనలో పేర్కొంటారన్నారు.

### అల్జీరియా సమస్యపై తెరవెనుకనే ఉంటారట

అల్జీరియా సమస్యపై ఉభయ పక్షాలను అవగతం చేసికోవడమే అమెరికా విధానమనీ, ఇరువురనూ శాంతి పరిస్థితికి తీసికొని రావాలనే ప్రయత్నిస్తామనీ ఆయన అన్నారు. అంటే, బయట మాడానిడి ఏమీ లేకుండా, తెరవెనుకనే ఉండి సంప్రదింపులు జరపడం అన్నమాట అన్నారు. ఐతే తాము ఏం చేసేదీ స్పష్టంగా చెప్పలేదు. కాని అల్జీరియా సమస్య ఫ్రాన్సు అంతరంగిక విషయం అన్నారు. సాధ్యమైనంతవరకూ యీ సమస్యా పరిష్కారానికి సహాయం చేస్తామన్నారు.

## ఈజిప్టు రక్షణ వ్యయం తగ్గింపు

### పొగాకుపై దిగుమతిపన్ను హెచ్చింపు

కైరో, జూలై 3: వర్తమాన సంవత్సరపు అంచనాలలో 57-58 లో ఈజిప్టు రక్షణ ఖర్చులను మాటికి చాలావంతులు తగించారు. ఈ బడ్జెట్‌లో 73,668,000 పౌనులను రక్షణకు కేటాయించారు. క్రిందటి సంవత్సరం 77,275,000 పౌనులను ఇందుకు ప్రత్యేకించారు. ఈ బడ్జెట్‌లో అస్వాన్ డాం నిర్మాణానికిగాను 28 లక్షల 18 వేల పౌనులనుకూడా కేటాయించారు. జోర్డాను తో చేసికొన్న ఒప్పందం ప్రకారం, ఆదేశానికి ఇచ్చేందుకు 5125 వేలపౌనులనుకూడా కేటాయించారు. బడ్జెటు మొత్తం 808,012,500 పౌనులు నికరటి మొత్తం 287,512,000 పౌనులు. కొత్త పన్నుల ప్రతిపాదన లేమీ లేవు గాని పొగాకు దిగుమతి పన్నును మాత్రం కిలోగ్రాంకు 50 పియాస్టర్ల వంతున అధికం చేశారు. ఇందువల్ల సాలీనా 6150 వేల పౌనుల అధికాదాయం వస్తుంది.

## స్టేట్‌బ్యాంకు నిల్వలు

కలకత్తా, జూలై 3: స్టేట్ బ్యాంకును జాతీయం చేశాక, ప్రజలలో విశ్వాసం అధికమైందని ఈ బ్యాంకు అధ్యక్షుడు శ్రీ పి. సి. భట్టాచార్య అన్నారు. 1954 డిసెంబరునాటికి ఈ బ్యాంకులో నిల్వలు 231 కోట్ల రూపాయలుంది. ఈ మొత్తం 55 జూన్ నెలాఖరుకు 211 కోట్లు అయింది. కాని ఈ సంవత్సరం జూన్ నెలాఖరుకు 316 కోట్ల రూపాయలకు పెరిగింది అన్నారు. జాతీయానికి ముందు ఈ బ్యాంకు 115 కోట్ల రూపాయలను అడ్వాన్సుగా ఇచ్చారు. ఐతే ఈ జూన్‌ఆఖరునాటికి ఈ మొత్తం 183 కోట్లు అయింది. గ్రామీణ ప్రాంతాలలో బ్యాంకింగ్ అభివృద్ధికీ, సహకార బ్యాంకులకు సదుపాయాలు చేసేందుకు వచ్చేఐదేళ్లలోనూ నాలుగువందల శాఖలకు తక్కువకాకుండా ఏర్పాటుచేయాలని స్టేట్ బ్యాంక్ నిర్ణయించిందన్నారు. ఇంతవరకూ 102 శాఖలను ఏర్పరచారు. ప్రభుత్వ హామీలతో సహకార సంస్థలకు ప్రత్యేక సౌకర్యాలు కలుగచేశారు. భూమి తనఖా బ్యాంకులద్వారా వ్యవసాయ దారులకు దీర్ఘకాల ఋణాలను బ్యాంకుఇచ్చింది. లఘు పరిశ్రమలకు అవసరమైన ప్రత్యేక సహాయం దృష్ట్యా, 56-57 లో మూడు బ్యాంకు కేంద్రాలలోను ఒక పైలట్ ప్రణాళికను అమలుపరిచారు. ఈ ప్రణాళిక ప్రకారం సహాయం కావాలని 51 దరఖాస్తులు వచ్చాయి. గత మార్చి వరకూ 23 లక్షల 48 వేల రూపాయలను సహాయంగా ఇచ్చారు. పారిశ్రామిక సహకార సంస్థలకు అవసరమైన స్వల్పకాల ఋణాలనుకూడా బ్యాంకు ఇచ్చింది. పైలట్ పథకం ప్రజానురంజకం కావడంవల్ల, పారిశ్రామిక రంగంలో బ్యాంకు ప్రముఖపాత్ర వహించే అవకాశంఉంది. పారిశ్రామిక రంగవిస్తృతికి ఏర్పాటు చేసేందుకు ఏర్పాటుచేయదలచిన రీఫైనాన్స్ కార్పొరేషన్‌లో అధికవాటాలు పుచ్చుకొనే వారిలో ఈ బ్యాంకు ఒకటి. ఈ బ్యాంకు రెండున్నరకోట్ల రూపాయల వాటా తీసికొంటుంది. ఈ సంస్థ వాటాల పెట్టుబడి 12 న్నర కోట్ల రూపాయలు. అమెరికా గోధుమల అమ్మకంద్వారా ఈ సంస్థకు మరో 26 కోట్ల రూపాయలు వస్తాయి. ఈ వ్యవహారాలన్నీ పూర్తికాగానే, ఈ సంస్థ పని ప్రారంభం కాగలదని శ్రీ భట్టాచార్య తెలిపారు.

## మటుమాయమైన పాక్ విమానం

ఢక్కా, జూలై 3: చిట్టగాంగ్ నుంచి సోమవారం ఉదయం 8 గంటల వేళ 24 గురితో ఢక్కాకు బయలుదేరి త్రోవలో మటుమాయమైన విమానం ఇంతవరకూ కనిపించనేలేదట.

ఈ విమానం గురించి యిప్పటికి రకరకాలు వార్తలు వచ్చాయి. విమానం ఒక చోట బలవంతంగా దిగిందని ప్రయాణీకు లందరు క్షేమంగా ఉన్నారని మొన్న కరాచీనుంచి వార్త వచ్చింది. ఈ వార్త సరిగాదని విమానం నౌఖాళీ సమీపంలో చార్‌లక్ష్మీ అనే చోట కూలిపోయిందని విమానంలో ఇద్దరు తప్ప అందరూ చనిపోయారని, నిన్న నౌఖాళీజిల్లా మేజిస్ట్రేటు, తనకు ఒక గ్రామస్థుడు చెప్పినట్లు, యిక్కడికి ఒక వార్త పంపాడు. ఇదీ నిజం కాదని, యిప్పటికింకా విమానం జాడ తెలియ లేదని పాకిస్తాన్ అంతర్జాతీయ విమానసంస్థ ఉద్యోగులనుండి తూర్పు పాకిస్తాన్ ప్రభుత్వానికి తెలిసింది.

ఈ విమానంకోసం చిట్టగాంగ్ నుంచి ఢక్కావరకు మార్గంపొడుగునా గాలించారు. సముద్రతీరం వెంబడి, త్రిపురప్రాంతంలోనూ వెతికారు.

నౌఖాళీ జిల్లా మేజిస్ట్రేటునుండి, చార్‌లక్ష్మీ ప్రాంతంలో విమానం కూలిపోయిందని వార్త రాగానే విమానాలను, ఒక హెలికాప్టర్‌ను ఆ ప్రాంతానికి ఉరికించారు. కాని విమానం కనిపించలేదు. విమానం కూలినట్లు కళ్ళారా చూచానని చెప్పిన గ్రామస్థుణ్ణి ఎక్కించుకొని హెలికాప్టర్ చార్‌లక్ష్మీ ప్రాంతానికి వెళ్లి వెతికింది. ఆ ప్రాంతం తీరాన ఉన్నందున ఇప్పుడు సముద్రజలమయమైంది. క్రింద ఏమీ కన్పించలేదు. దీనికితోడు రేపు ఇంకో హెలికాప్టర్ విమానం కూడా కలిసి అన్వేషణ సాగిస్తాయి.

# మధ్యప్రదేశ్ ద్వితీయ ప్రణాళిక

## జిల్లాప్రణాళికలుగా విభజిస్తారని పటాస్కర్ ప్రకటన

భోపాల్, జూలై 2: రాష్ట్రద్వితీయ ప్రణాళికను జిల్లా, తాలూకా ప్రణాళికలుగా విభజిస్తారని మధ్యప్రదేశ్ గవర్నరు శ్రీ హెచ్. వి. పటాస్కర్ ప్రకటించారు.

ఇందువలన స్థానికంగా ఏమిజరుగుతోందో వివిధజిల్లాలవారికి తెలుస్తుందని శ్రీ పటాస్కర్ నిన్న మధ్యప్రదేశ్ విధాన్ సభలో ప్రారంభోపన్యాసం చేస్తూ అనించారు.

ప్రణాళికా సంఘం, రాష్ట్రప్రభుత్వం చర్చించుకొని ఈ రాష్ట్రానికి ద్వితీయ ప్రణాళికా ప్రమాణాన్ని 190 కోట్లుగా నిర్ణయించారు. రాష్ట్ర పునర్నిర్మాణంవల్ల మొదటిసంవత్సరం కార్యక్రమం కొంత కుంటుపడినమాట నిజంఅయినా పరిష్కృత అంచనాల ద్వారా అనుకున్నదానికంటె రు 4 కోట్లుమాత్రం తగ్గినట్లు కనిపిస్తుంది అని ఆయనచెప్పారు.

# పశ్చిమ పాక్‌లో రిపబ్లిక్ పార్టీ

## బలం లేకపోయినా మళ్లీ ప్రభుత్వాధికారం

లాహోర్, జూలై 2: పశ్చిమ పాకిస్తాన్ శాసనసభలోని రిపబ్లికన్ పార్టీ యివాళ సాయంత్రం సమావేశమైంది కాని, ప్రభుత్వాధికారం స్వీకరించగలిగినంత బలం ఉన్నట్లు కన్పించలేదు. 140 మంది సభ్యులు హాజరైనట్లు తెలిసింది. అంటే మొత్తం శాసనసభాసభ్యత్వంలో సగానికన్నా తక్కువ. మరో 4గురు సభ్యులు రాత్రికిసమావేశంలో పాల్గొంటారని, యీ పార్టీని బలపరుస్తామని వాగ్దానంచేసిన 21 మంది సభ్యులు—దేశాంతరం వెళ్ళడంగాని, జబ్బుపడడంగాని జరిగి ఉండవచ్చునని రిపబ్లికన్ వర్గాలవారు చెప్పారు. వీరందరు కలిస్తే పార్టీ సంఖ్య 170 దాకా పెరుగుతుందన్నారు.

ఇవాళటి సమావేశంలో రిపబ్లిక్ పార్టీ, శాసనసభలో తమకు బలం ఉన్నదని నిరూపించగలిగితే, మళ్ళా అధికారంలో ప్రతిష్ఠిస్తారని ఇంతక్రితం తెలిసింది. ఇవాళటి సమావేశంలో బలం ఉన్నట్లు ఋజువుకాకపోయినా, మళ్ళా మాపార్టీకే అధికారం ఇస్తారని కేంద్ర ప్రభుత్వాధికారులు వాగ్దానం చేశారని పార్టీనాయకుడు డా॥ ఖాన్ సాహెబ్ చెప్పారు.

డా॥ ఖాన్‌సాహెబ్ నాయకత్వం నుండి విరమించదలచానని చెప్పడం చేత పార్టీకి కొత్త నాయకుణ్ణి కూడా యీ సమావేశంలో ఎన్నుకొంటారని, రాత్రి పొద్దుపోయేదాకా సమావేశం జరుగుతుందని పార్టీవర్గాలవారు అన్నారు.

# ప్రథమ స్వాతంత్ర్య సమర శత వార్షికోత్సవం

## ప్రత్యేక తపాలాబిళ్లల నమూనా

మధుర, జూలై 3: వివాదాలకు ఆస్కారం లేకుండే నిమిత్తం 1857 సంవత్సరపు వీరుని బొమ్మను ప్రత్యేక స్మారక తపాలా బిళ్లలపైన ముద్రించదలచ లేదని కేంద్ర తంతి తపాలా మంత్రి శ్రీ రాజ్ బహదూర్ పత్రికా ప్రతినిధులకు చెప్పారు. అయితే వీర నారీమణి ఝాన్సీరాణి బొమ్మను మాత్రం ముద్రిస్తారని ఆయనఅన్నారు.

రెండు రకాల సంస్మరణ తపాలా బిళ్లలను వేస్తారు. ఒక దానిమీద శ్లోకం వుంటుంది. రెండవదానిమీద ఝాన్సీరాణి బొమ్మ వుంటుంది.

# సూర్యమండలంలో మరో పెద్ద ప్రేలుడు

న్యూయార్క్, జూలై 2: సూర్యమండలంలో మరో బ్రహ్మాండమైన ప్రేలుడు సంభవించినట్లు నిన్న రాత్రి అమెరికాలో కన్పించింది. అంతక్రితం సంభవించిన ప్రేలుడు ఫలితాలను శాస్త్రజ్ఞులు ఇంకా పరిశీలిస్తుండగానే యిది సంభవించింది.

అయితే ఇది మొదటిదానంత తీవ్రమైనది కాదట. కొలోస్లోకేలోని వ్యోమమండలం పరిశోధక కేంద్రంవారు భూమిని ఆవరించియున్న వాతావరణంపై పొరలలో తీవ్రమైన కల్లోలం చెలరేగినట్లు ప్రకటించారు.

సూర్య మండలంలో సంభవించిన కల్లోలం సింహళంలోని శాస్త్రజ్ఞులకు కూడా కన్పించింది. ఈ శాస్త్రజ్ఞులు వ్యోమమండలంలోని పరిస్థితులు పరిశోధన చేస్తున్నారు. సింహళంలో రేడియో ప్రసారాలు పూర్తిగా భగ్నమైపోయాయి. కేవులులోని వాకలపటేలంతో చాలా గంటలసేపు రేడియో సంబంధాలు తెగిపోయాయి.

మరో 4 గంటలసేపు రేడియోప్రసారాలకు యీ అంతరాయం ఉండవచ్చునని స్లోలోని (బ్రిటన్) రేడియో పరిశోధక కేంద్రం ఉద్యోగి ఒకరు చెప్పారు.

# భూ విజ్ఞాన కార్యక్రమం

## దక్షిణ ధ్రువంలో పరిశోధన

న్యూయార్క్, జూలై 3: అంతర్జాతీయ 'భూ భౌతిక' విజ్ఞాన పరిశీలనా కార్యక్రమం ఈ జూలై నెల మొదటి తేదీలో ప్రారంభమైంది. 56 దేశాలకు చెందిన 5,000 మందికి పైగా శాస్త్రవేత్తలు ఈ కృషిలో పాల్గొంటున్నారు. ఈ కార్యక్రమంవల్ల ఇంతవరకూ మానవునికి అంతుబట్టని అనేక ప్రకృతి రహస్యాలు తెలియటమే గాక అంతర్జాతీయ సహకారం, సద్భావాలు పెరుగుతాయి. హిమావృతమైన సువిశాల దక్షిణ ధ్రువ ఖండాన దాని సమీపాన వున్న ఏడు కేంద్రాలనుంచి పరిశోధనలు సాగుతాయి.

ఇందులో ఒకటి దక్షిణ ధ్రువంవద్ద మరొకటి వేల్స్ అఖాతంవద్దనున్న లిటిల్ అమెరికాలోను, మూడవది హిమావృతమైన రాకిఫెల్లర్ పర్వతాల వద్ద వున్నాయి.

వీటికి తోడు దక్షిణధ్రువ ఖండానికి ఎదురుగా వెడ్డెల్ సముద్రంమీద, రాస్ సముద్రం మీద హాలెట్ అగ్రం సమీపాన, ఆఫ్రికాను దక్షిణానసాక్స్ తీరాన శాస్త్రవిజ్ఞాన పరిశోధక కేంద్రాలు ఏర్పాటు అవుతాయి. ఈ పరిశోధనలను లెక్కలద్వారా బలపరుచుకునేటందుకు గాను వైమానిక చర్యలు జరిపే కేంద్రాన్ని రాస్ సముద్రం మీద 'మెక్ ముర్డో సౌండ్' వద్ద ఏర్పాటు చేస్తారు.

దక్షిణ ధ్రువపు ఈ కేంద్రాలలో శాస్త్రజ్ఞులు భూగోళ శాస్త్రానికి సంబంధించిన అనేక రంగాలలో పరిశోధనలు కొనసాగిస్తారు. ఈ పరిశోధనలలో దక్షిణధ్రువ జ్యోతి (అరోరా, లేక సదరన్ లైట్) విశ్వ కిరణాలు, భూమ యస్కాంతం, హిమనీనదశాస్త్రం, విద్యుదయస్కాంత మండల విజ్ఞాన శాస్త్రం, వాతావరణ శాస్త్రం, ఉన్నత వాతావరణాన్ని రాకెట్లలో అన్వేషించడం, భూకంపశాస్త్రం, గురుత్వాకర్షణను గురించిన విషయాలున్నాయి.

సువిశాలమైన రాస్ హిమప్రదేశాన గల లిటిల్ అమెరికాలోని పరిశోధన కేంద్రమే మిగిలిన పరిశోధన కేంద్రాలన్నిటికీ కేంద్ర స్థానంగా పనిచేస్తుంది. దక్షిణ ధ్రువానికి తీరాన అతి దగ్గరగా—800 మైళ్ళకు లోపున వున్నదిది.

ఇతర మార్గాల సుండా దక్షిణ ధ్రువాన్ని చేరడానికి, ఆ విధంగా అవసరమైన సరఫరాలను, సామగ్రిని చాలవరకు ఓడలద్వారాను భూమార్గాల సుండాను చేరవేసుకొనడానికి వీలు కల్పిస్తుంది. ఇక్కడినుంచి, ఖండాంతర్భాగాన వున్న మేరీబైర్డ్‌లాండ్ కేంద్రానికి రాకిఫెల్లర్ పర్వత శ్రేణికి సుండా, దళసరి గుల ద్వారా గాని, అవసరమైతే విమానాల పైనుంచి పడవేయడం ద్వారా గాని సరఫరాలు జరుగుతాయి.

లిటిల్ అమెరికా కేంద్రం బృహత్ శాస్త్ర విజ్ఞాన కార్యక్రమ స్థావరంగా పనిచేయటమేగాక ప్రధానమైన వాతావరణ పరిశోధక స్థావరంగాను, వార్తా ప్రసారక కేంద్రంగాను కూడా పనిచేస్తుంది.

రాస్ హిమ ప్రదేశాన్ని గురించిన అన్వేషణే ఈ పరిశోధన క్రమంలో ఒక ముఖ్యభాగం. ఇది ప్రపంచపు వింతలలో ఒకటి. దక్షిణ ధ్రువ ఖండపు కొంగుపట్టునని వున్నట్లుండి, నీటిలో తేలియాడే 15,000 చదరపు మైళ్ళ మంచుకొండ ఇది. దీనినుంచి హిమశిలలు ఎల్లప్పుడు విరిగి పడిపోతూ వుంటాయి. ఖండాంతర హిమానీ నదాలనుంచి కొత్తగా హిమశిలలు అదే పనిగా ఏర్పడుతూ వుంటాయి.

ఈసువిశాల హిమప్రదేశ పరిశీలన ముఖ్యం. ఎందువల్లనంటే, దాని వాతావరణ పరిస్థితుల ప్రభావం మిగతా ప్రపంచపు వాతావరణ పరిస్థితులపైన విశేషంగా వుంటున్నది. అల్పపీడన అత్యంత విశేషంగా తరుచు వుంటున్న ప్రాంతం ప్రపంచంలోకల్లా ఇదే.

ఈ ప్రాంతం దక్షిణధ్రువఖండంలో అంతర్భాగమని కొందరు భూగర్భశాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఈ ప్రదేశంలో లోతైన లోయలు, చిన్న తరహా పర్వత పంక్తులు, విస్తృతమైన మంచు ఎడారులు ఉన్నాయి.

లిటిల్ అమెరికాలో మకాంచేసే శాస్త్రజ్ఞుల బృందం ఈ హిమప్రదేశపు పటాన్ని తయారు చేయడానికి ప్రయత్నిస్తారు. సాలీనా మంచు ఏ లెక్కను చేరుతున్నదో, ఏ లెక్కను వీరూపంలో సాలీనా మంచుతరుగు అవుతున్నదో కూడా వారు పరిశీలిస్తారు.

పరిశీలన జరిగే ఇతర విషయాలలో హిమ ప్రదేశపు వివిధ భాగాలలో స్థానికంగా వాతావరణం ఎలా వుందో, వాతావరణం మార్పుల ప్రభావం హిమ ప్రదేశం మీద ఎలావుందో మంచు ఉపరితలం మీద వేడిలో మార్పులు ఏ విధంగా కలుగుతున్నాయో పరిశీలించడం కూడా వున్నాయి.

రెండు వేసవికాలాల పొడుగునా—దాదాపు నిర్విరామంగా పగలుగా వుండే విడుమాసాల కాలంపాటు—పరిశీలనలు జరుగుతాయి. చలుగుడుల పైన అన్వేషణలు జరిపే ప్రదేశంలో కొన్ని భాగాలలోగుగా నెరియలు పడి వుండడంవల్లను, మకాము దగ్గరి ప్రాంతాలు మాత్రమే బాగా తెలిసిన వయిఉండడం వల్లను, ఈ అన్వేషణలు చాలా ప్రమాద భరితాలు.

# అమెరికాలోని జపాన్ నిధుల బదిలీ

## పరిశీలిస్తామని ఒక్ హామీ ఇచ్చారట

న్యూయార్క్, జూలై 3: అమెరికా అధ్యక్షుడు ఐసెన్ హోవర్ జపాన్ ప్రధాని కిషీల సంయుక్త ప్రకటనలో లేని మూడు అంశాలపై జపానుకు అమెరికా హామీ ఇచ్చిందనీ, ఈ విషయాలను టోక్యోచేరిన కొద్ది గంటల వ్యవధి శ్రీ కిషీ తన మంత్రివర్గానికి తెలిపారని న్యూయార్క్ టైమ్స్ పత్రిక పేర్కొంది. ర్యూకిన్ దీవుల నుండి పారిపోయిన జపాన్ దేశస్థులలో కనీసం ఏడువేల మందిని తిరిగి జపానుకు పంపడం, టోక్యోలోని జైలులో ఉన్న 68 మంది యుద్ధ ఖైదీలను జపానుకు వప్పగించడం, యుద్ధం ప్రారంభమైన సమయంలో అమెరికా స్వాధీనం చేసికొన్న జపాన్ నిధులను తిరిగి ఇచ్చేవిషయాన్ని పరిశీలించడం విషయాలపై అమెరికా హామీ ఇచ్చిందని ఈపత్రిక వ్రాసింది. యుద్ధం ప్రారంభమైనప్పుడు అమెరికా లోని ఆరుకోట్ల డాలర్ల జపాన్ నిల్వలను అమెరికా స్వాధీనం చేసికొంది.

ఈ విషయాలను శ్రీ కిషీ రహస్య సమావేశంలో మంత్రివర్గానికి వివరించారట. ఈమూడింటినీ సంయుక్త ప్రకటనలో పేర్కొనక పోవడానికి కారణాలుకూడా ఆయన చెప్పారట. నిల్వల విడుదల విషయంలో ఇలాంటి సంప్రదింపులే పశ్చిమ జర్మనీతో సాగుతున్నాయి. బోనిన్ ద్వీపవాసుల అప్పగింత విషయంలో పేర్కొన వలసిన పదాల విషయంలో భిన్నాభిప్రాయం వచ్చింది; యుద్ధ ఖైదీల విషయంలో విలియంగిరాడ్ వివాదం ఉంది. ఈ కారణాలవల్ల వీటిని ప్రకటనలో పేర్కొనలేదని ఈ పత్రిక వ్రాసింది.

ఈ వార్తలపై వ్యాఖ్యానించడానికి వాషింగ్టన్‌లోనిజపాన్ రాయబారోద్యోగులు అంగీకరించలేదు.

## ఒకినావాను జపాన్‌కు ఇచ్చేది లేదని డల్లెస్

వాషింగ్టన్, జూలై 3: 1951 లో శాన్ ఫ్రాన్సిస్కోలో జపాన్ శాంతి సంధిపైసంతకాలుచేస్తున్న సమయంలో ఒకినావాను అమెరికా స్వాధీనం చేసికోవాలని కొన్ని మిత్రరాజ్యాలు కోరాయనీ, అందువల్ల ఈ దీవిపై కలకాలమూ అమెరికా జండా ఎగరవలసిందేననీ అమెరికా విదేశాంగ మంత్రి శ్రీ డల్లెస్ అన్నారు. ఒకినావా పరిపాలనాధికారాన్ని జపాన్ పరం చేయాలని ఆ దేశ ప్రధాని శ్రీ కిషీ కోరారు. కాని పసిఫిక్ ప్రాంతంలో శాంతిభద్రతలు చేకూరాయని అమెరికా భావించే వరకూ ప్రస్తుత విధానంలో ఏమీ మార్పు ఉండదన్నారు. ఐతే ఈ దీవిపై జపానుకు నామమాత్ర సార్వభౌమాధికారం ఇచ్చి, పరిపాలనాది బాధ్యతలను మాత్రం అమెరికా చేతులలో ఉంచడం ఈ సమస్య పరిష్కారానికి ఉత్తమమైన సూచన అన్నారు.

# ఈజిప్టు ఎన్నికలు

## నాసర్‌ను బలపర్చేవారి విజయం ఖాయం

కైరో, జూలై 2: రేపు ఈజిప్టు అంతటా జాతీయ శాసనసభకు జరిగే ఎన్నికలలో, నాసర్‌ను బలపర్చేవరానికి బ్రహ్మాండమైన విజయం ఖాయమని అంటున్నారు. శాసనసభలో మొత్తం 350 స్థానాలలో 271 స్థానాలకు రేపు ఎన్నికలు జరుగుతున్నాయి. మిగతావాటికి, అభ్యర్థులు ఇదివరకే పోటీలేకుండా ఎన్నికైనారు.

అప్పుడే అనేకచోట్ల ప్రత్యర్థి పార్టీలకు కొట్లాటలు సంభవించడంచేత శాంతిభద్రతలు కాపాడడానికి పోలీసులతోపాటు సైనికులుగూడా సర్వసన్నద్ధంగా ఉన్నారు. ఎక్కడ ఏ అవాంతరంవచ్చినా అక్కడికక్కడ అందుకు తగ్గట్లు వ్యవహరించే అధికారాలు గవర్నర్లకు ఇవ్వడమైంది. పోలింగు కేంద్రాలవద్ద ఆయుధాలు—ఆఖరికి కర్రలుకూడా పట్టుకొని తిరక్కూడదని నిషేధం పెట్టారు.

## డా॥ నుక్రుమాకు రష్యా ఆహ్వానం

లండన్, జూలై 3: ఘనా ప్రధాన మంత్రి శ్రీ నుక్రుమాను రష్యాకు వచ్చి వెళ్ళవలసిందిగా రష్యా ప్రభుత్వం ఆహ్వానించింది. ఆ ఆహ్వానాన్ని శ్రీ నుక్రుమా ఆమోదించారు

శ్రీ నుక్రుమా రష్యాకు ఎప్పుడువెళ్లేది తేలలేదు. నేడు ఈయన బ్రిటన్‌లోని రష్యా రాయబారి శ్రీ మలిక్‌ను కలుసుకుంటారు. అప్పుడు ఈవిషయం చర్చకు వస్తుంది. అంతేగాక ఈ రెండు దేశాల మధ్య రాజకీయ సంబంధాలను ఏర్పాటు చేసుకోడాన్ని గురించి గూడా వీరు ఈ సందర్భంలో మాట్లాడారు.

## అమెరికా రక్షణ వ్యయం 3450 కోట్ల డాలర్లు

వాషింగ్టన్, జూలై 3: అమెరికా రక్షణ వ్యయానికిగాను 3450,000000 డాలర్ల మొత్తాన్ని అమెరికా సెనెట్ నేడు ఆమోదించింది. ఇది 1957-58 రక్షణ ఖర్చు. దిగువసభ మే 29 న ఆమోదించిన మొత్తం కన్నా ఇది 100 కోట్లడాలర్లు ఎక్కువ.



జూన్ 29న గుంటూరునుండి మదరాసుకు పొగాకు చేరవేస్తున్న లారీ నం. ఎ. డి. జి. 1131 స్థితి. విద్యుచ్ఛక్తిస్తంభాన్ని ఢ్ఢుకొని బోల్తాలు కొట్టింది.



ఆంధ్ర గ్రామోద్యోగుల సంఘ అధ్యక్షుడు ఎన్. వెంకటప్పన్నపట్నాయక్.



ఆంధ్ర గ్రామోద్యోగుల సంఘ కార్యదర్శి శ్రీ బుద్ధవరపు వేంకటరత్నం.

# కామన్వెల్త్ ప్రజలకు మలయా పౌరహక్కు

## రద్దుచేసే అధికారంపై రాజ్యాంగంలో వివరణ

కౌలాలంపూర్, జూలై 2: కామన్వెల్త్ దేశాల పౌరులు మలయా పౌరహక్కును పొందిఉంటే, ఆ పౌరహక్కును రద్దుచేసేఅధికారం మలయా ప్రభుత్వానికి వుందని ఈ కొత్త రాజ్యాంగ ముసాయిదాలో పేర్కొన్నారు. ఈ రాజ్యాంగం మలయా స్వతంత్ర్య దేశంగా అవతరించే వచ్చే ఆగస్టు 31 వ అమలులోనికి వస్తుంది. మలయా పౌరులకుగల హక్కులను కామన్వెల్త్ దేశాల పౌరులుకూడా పొందాలనిప్రయత్నిస్తే వీరికిగల మలయా పౌరహక్కును రద్దుచేస్తారు. ఇలాంటి పౌరహక్కులను రద్దుచేయాలనుకొన్నప్పుడు ప్రభుత్వం ముందుగా ఒక సంఘంద్వారా పరిశీలన జరుపుతుంది. మలయా స్వాతంత్ర్యం పొందాక, ఇతరదేశాలవారు పొందిన మలేయా పౌరహక్కులనుకూడా రద్దుచేసే అధికారం ప్రభుత్వానికి వుంది.

వంశపారంపర్యంగాఉన్న తొమ్మిది మంది పరిపాలకులలోను ఒకరిని రాజుగా ఎన్నుకుంటారు. మలయా ఇస్లాంమతరాజ్యంగా ఉంటుంది. ఐతే మతావలంబనలో స్వేచ్ఛఇస్తూరాజ్యాంగంలో పేర్కొన్నారు. వచ్చేనెలలో జరిగే శాసనసభలో ఈ ముసాయిదాను ప్రవేశపెడతారు.

## బ్రిటన్ ఈజిప్ట్ రాయబార సంబంధాలు

లండన్, జూలై 2: రాయబార సంబంధాలు మళ్లీ యేర్పాటు చేసుకొందామని ఈజిప్టు యింతవరకూ మమ్మల్ని అడగలేదు అని విదేశాంగశాఖ ప్రతినిధి ఒకరివాళ చెప్పారు. ఇప్పుడు మా అంతట మేము ఈజిప్టును అడగము. మమ్మల్ని అడిగితే ఆలోచిస్తాం అన్నారాయన.

ఈజిప్టు అధ్యక్షుడు నిన్న రాత్రి టెల్వీజన్ గోష్ఠిలో - బ్రిటన్‌తో మళ్లీ మామూలుగా సంబంధ బాంధవ్యాలు యేర్పాటు చేసుకోవాలనే నా కోర్కె అన్నారు. దానిపై విలేఖరులు, యివాళ బ్రిటిష్ విదేశాంగశాఖప్రతినిధిని కలుసుకొని పై సంగతి అడిగారు.

# మైసూరులో గనుల త్రవ్వకం

## ప్రభుత్వమే సంస్థను ఏర్పాటుచేసే సంకల్పం

బెంగుళూరు, జూలై 3: రాష్ట్రంలో గనులను త్రవ్వించేందుకు ప్రభుత్వమే ఒక సంస్థను యేర్పాటు చేయదలచినట్లు ఇవాళ అధికారరీత్యా తెలిసింది.

ఇందుకు సంబంధించిన వివరాలు ఇప్పుడు తయారవుతున్నాయి. ఇనుము మాంగనీసు మొదలగు ముఖ్యమైన గనుల త్రవ్వకం యీ సంస్థకు వప్పగించి, మారుమూలల ఉన్న అట్టే ముఖ్యంకాని గనుల త్రవ్వకానికి, పారిశ్రామికులకు ఇస్తారని తెలుస్తున్నది.

## తాతాకంపెనీలో ఉత్పత్తి

బొంబాయి, జూలై 3: తాతా ఇనుము ఉక్కుకంపెనీలో ఈ జూన్ నెలలో 84500 టన్నుల దుక్క ఇనుము 77300 టన్నుల ఉక్కుముద్దలు ఉత్పత్తి అయినాయి. అమ్మకానికి ఉత్పత్తి అయిన ఉక్కు 52300 టన్నులు.

# విద్యావంతులైన నిరుద్యోగులు

## భూదాన సైన్యంలో చేరాలని బావే సలహా

పూనా, జూలై 3: విద్యావంతులైన నిరుద్యోగులు భూదానసైన్యంలో చేరటం ద్వారా, గ్రామాల్లో పర్యటిస్తూ, ప్రజలకు నూతన సందేశాన్ని ప్రబోధించాలని ఆచార్య వినోబా భావే కోరారు.

ఈ వారం 'భూదాన్' పత్రికలో నిరుద్యోగులకు ఒక విజ్ఞప్తిచేస్తూ శ్రీ భావే యీవిధంగా వ్రాశారు.

"మనది సువిశాలమైన దేశం. మన సమస్యలు గూడా అనంతమైనవే. దైవంగా ప్రభుత్వంపై ఆధారపడటం మనకు తగనిపని. కాబట్టి తప్పనిసరిగా ఆత్మవిశ్వాసాన్ని అలవరచుకోవాలి.

"ప్రస్తుత విద్యావిధానం, యువకులలోని పరిశీలనాత్మక స్వభావాన్ని అభివృద్ధి పరచటంలో సహాయకారి కాలేదు. ఈ విద్యావిధానానికి పరీక్షలే ముఖ్యము. ఉపాధ్యాయుడు, శిష్యులు, ఎక్కువగా తమ గదిలోనే కాలక్షేపం చేయటంవల్ల విజ్ఞానం ప్రధానంగా పుస్తకాలకు అంటిపెట్టుకునే ఉండిపోవటం జరిగింది. ఈకారణంవల్ల మన చుట్టుప్రక్కల వాతావరణంతో దీనికి ఎలాంటి సంబంధం లేకుండాపోయింది. ఈ పరిస్థితుల్లో చదువుకున్న వ్యక్తి మానసికంగా సంఘానికి పరాయివాడై పోవటం తటస్థించింది. మన యువకులు ఏమాత్రం పని గూడా చేయలేని బలహీనులైపోయారు. వీరిలో స్వతంత్రమైన బ్రదుకుతెరువును వెదుకుకో గల సామర్థ్యం నశించి, గుమాస్తా ఉద్యోగాలకు ఎగబడటం ఆరంభించారు.

"కాబట్టి విద్యావంతులైన మన యువకులు ప్రజల్లో కలిసిడిగా తిరుగుతూ దేశంలో నవసమాజ నిర్మాణానికి పూనుకోవాలి. ఇది తరుణ కర్తవ్యము."

# ఆంధ్రలో 2 పారిశ్రామిక కేంద్రాల స్థాపన

## లఘుపరిశ్రమలవృద్ధికి అవకాశాలు

న్యూఢిల్లీ, జూలై 3: లఘు పరిశ్రమల అభివృద్ధికి అవసరమైన అవకాశాలు కల్పిస్తూ, జాతీయ లఘు పరిశ్రమల సంస్థ దేశవ్యాప్తంగా 25 పారిశ్రామిక కేంద్రాలను నిర్మిస్తున్నది. ఇలాంటి కేంద్రాలు ఆంధ్రలో రెండు ఏర్పాటవుతాయి.

ఈ కేంద్రాల నిర్మాణానికి రు. 767 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా వేశారు. కేంద్ర ప్రభుత్వం యింతవరకు వీటికిందరు. 120 లక్షలు మంజూరు చేసింది. ఈ కేంద్రాల స్థాపనకు అయ్యే మొత్తం ఖర్చును భారతప్రభుత్వమే పెట్టుబడి పెడుతుంది. అయితే వివిధ రాష్ట్రాలు, దీర్ఘకాలిక ఋణాలుగా, యీ వ్యయాన్ని తరువాత చెల్లిస్తాయి.

ఈ 25 కేంద్రాల్లోను కేరళలో 5, మదరాసు 3, ఉత్తరప్రదేశ్ 3, మధ్యప్రదేశ్ 2, బీహార్ 2, ఆంధ్ర 2, పశ్చిమబెంగాల్, బొంబాయి, మైసూరు, ఢిల్లీ, అస్సాం, రాజస్థాన్, ఒరిస్సా, పంజాబ్ రాష్ట్రాల్లో ఒక్కొక్కటి చొప్పున నెలకొల్పుతారు.

సమాజ వికాస ప్రాంతాల్లో ఏర్పాటవుతున్న తొమ్మిది పారిశ్రామిక కేంద్రాల్లో, ఒకటి కాకినాడవద్దనిర్మిస్తారు.

ఈ కేంద్రాల్లో ప్రభుత్వం అవసరాన్ని బట్టి వ్యవసాయాభివృద్ధి, రోడ్ల నిర్మాణం, ఫ్యాక్టరీ భవనాల కట్టుబడి లాంటి చర్యలను నిర్వహిస్తుంది. వర్క్‌షాపులు, కార్మికులకు గృహవసతి గూడా ఏర్పాటు చేయాలని ఆలోచన జరుగుతున్నది. 1957-58 లో 20 లఘు పారిశ్రామిక కేంద్రాలను ఆరంభించాలని ప్రభుత్వం నిర్ణయించినట్లు తెలుస్తున్నది. ఒక్కొక్క కేంద్రానికి రు. 3, 4 లక్షలకంటె ఎక్కువ ఖర్చుకాదని అంచనా వేశారు.

## తూర్పుపంజాబ్ ఉపమంత్రిరాజీనామా

చండీఘర్, జూలై 3: తూర్పు పంజాబు ప్రభుత్వ విద్యాశాఖ ఉపమంత్రి యశ్ పాల్, యివాళ రాజీనామా ఇచ్చారు.

తన రాజీనామాకు రాజకీయ కారణాలున్నాయని, రాజీనామా ఇస్తున్న సంగతి నిన్ననే కాంగ్రెసు అధిష్టానవర్గానికి తెలియచేశానని చెప్పారు.

శ్రీ యశ్ పాల్ హిందీ అభిమాని అని అందరికీ తెలుసు. అయితే హిందీ రక్షాఉద్యమం పట్ల సానుభూతి చూపడంకోసం రాజీనామా ఇవ్వలేదని ఆయన స్పష్టంచేశారు.

హిందీ రక్షాఉద్యమం నడుపుతున్న ఆర్య సమాజ్ అగ్రనాయకుడుస్వామి ఆనంద సరస్వతి కుమారుడు ఉద్యమం విరమించమని చెప్పి నందుకు స్వామి ఆనందసరస్వతిని యీ మధ్యనే సమితి నుంచి వెళ్లగొట్టారు.

## బెంగుళూరులో పశువైద్య కళాశాల

బెంగుళూరు, జూలై 3: ఈనగర శివార్లలో పశువైద్య కళాశాలను యేర్పాటుచేయాలని మైసూరు ప్రభుత్వం సంకల్పించినట్లు తెలిసింది.

ముఖ్యమంత్రి శ్రీ ఎస్. నిజలింగప్ప వ్యవసాయమంత్రి శ్రీ హెచ్. ఎస్. రుద్రప్ప, నగరశివార్లలో హెబ్బాల్ వద్ద స్థలాలను, 12 మైళ్లలోని హెస్సార్ ఘట్టప్రదేశాన్ని యీ కళాశాలకు అనువుగా ఉంటుందేమో పరిశీలిస్తారు.

# భారత సేవక్ సమాజానికి పంచసూత్ర ప్రణాళిక

## సామ్యవాద సమాజ స్థాపనలో ప్రముఖపాత్ర - నందా వివరణ

పాట్నా, జూలై 3: కేంద్రప్రణాళికాశాఖా మంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా భారత సేవకసమాజానికి ఒక పంచసూత్రప్రణాళికను సూచించారు.

బీహార్ రాష్ట్ర సేవకసమాజ మండలి, కార్యకర్తల సమావేశంలో ప్రసంగిస్తూ, శ్రీ నందా యీ సమాజం కొనసాగించవలసిన కార్యక్రమాన్ని యీ విధంగా వివరించారు. జాతీయైక్యత, ఉత్పత్తి పెంపొందించి దుబారాను అరికట్టటం, అత్యవసర పరిస్థితులలో ప్రజలకు సేవచేయటం, మరికొ పేటలను బాగుపరచటం ద్వారా ప్రజారోగ్యాన్ని అభివృద్ధిపరచటం, యోగ వ్యాయామాలను ప్రచారం చేయటం, సమాజ లక్ష్యాలుగా ఉండాలని వీరన్నారు.

సామ్యవాద సమాజస్థాపనలో యీ సమాజము ప్రముఖపాత్ర నిర్వహిస్తుందనీ, రాజకీయాలకు అతీతమైన సంస్థ కావటంవల్ల అన్ని పక్షాల సహకారంతో మన అభివృద్ధి పథకాలకు ప్రజల అండదండలను లభింపచేయటానికి యిది అద్భుతంగా తగిఉన్నదనీ మంత్రి తెలియజేశారు.

ఈ సమాజం, కాంగ్రెస్‌కు చెందిన మరో ఉపసంస్థ అన్న విమర్శలను శ్రీ నందా ఖండించారు. అందరికీ యిందులో ప్రవేశం ఉంటుందంటూ, యీ సమాజ స్థాపన జరిగినప్పుడు అన్నిపక్షాలను ఆహ్వానించి, దేశాభివృద్ధికి సమిష్టిగా కృషి చేయ వలసినదిగా కోరామన్నారు. ఏవో కొన్ని రాజకీయ పక్షాలు దీనిని సమర్థించనంత మాత్రాన, యీ సంస్థ రద్దుకాదని గూడా స్పష్టం చేశారు. ఈ సమాజం మహత్తరమైన కార్యక్రమాన్ని కొనసాగించవలసి ఉన్నదని చెప్తూ, యీ సంస్థలో యిప్పుడున్న వ్యక్తులే దీనిని ముందుకు తీసుకొనివెళ్లక తప్పదని శ్రీ నందా అన్నారు.

వివిధ అభివృద్ధి పథకాల నిర్వహణకు వీలుగా, సమాజ కార్యకర్తలు యింటింటికీవెళ్లి కొత్త సభ్యులను చేర్పించాలని ప్రణాళికామంత్రి సూచించారు.

# ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్

తిరుపతి, జూలై 2: ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్‌కు చిత్తూరుజిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గం నుంచి ఐదుగురు అభ్యర్థులు పోటీచేస్తున్నారు. నియోజకవర్గం నుంచి సెనేట్‌కు ఒక సభ్యుడు ఎన్నిక కావాలి.

పోటీలో పాల్గొంటున్నవారు: శ్రీయుతులు పి. ఎస్. గురవారెడ్డి (తిరుపతి పురపాలక సంఘ సభ్యుడు), సి. కేశవయ్యనాయుడు (చంద్రగిరి తాలూకా భీమవరంపంచాయతీ అధ్యక్షుడు), గాదిరాజు రామమూర్తి, కట్టమంచి విజయసింహారెడ్డి (చిత్తూరు పురపాలక సంఘ సభ్యులు), పుట్టా శ్రీ రామరెడ్డి (పుంగనూరు తాలూకా ఏటవాకిలి పంచాయతీ అధ్యక్షుడు.) (స్వ. వి.)



Printed and Published for Nageswara Rao Estates (private) Ltd. by S. Radha Krishna, at the Andhra Patrika Press, 6& 7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.